# రంజనిమాల

సంకలనం

డా॥ వి. ఫణీంద్రుడు

## ఆ ధా ర ము లు

సుమతీ శతకంలోని ఈ మాటలను : గప్పలు, గావలె, పాముల, పుత్రుడు, రత్నము, సెప్పకు, కవకపు, నిర్వాహము, పులిపాలు, మిడుకుట, రణమున, కుదువబెట్ట, తన కలిమి, అధిక బాధ, తన శాంతము తనకు, కులగాంత తోడనెప్పుడు, నట్టడవులకైనవచ్చు, కొఱగాని కొడుకు పుట్టిన, అడియాస కొలువు గొలువకు, ఒక యూరికి నొక కరణము, కరణము గరణమున నమ్మిన, అధరము గదలియు గదలక, ధన భాగ్యమె తనకు గాక తథ్యము ; దిగువ నీయబడిన ఆధారములతో అమర్చి రంజనిమాలను పూరించండి.



### అడ్డము

1. " — గుడిమణియము సేయబోకు "
5. " పరిపూర్ణ సుఖంబు — లకొరకే "
7. " నాకే నరులకు — "
9. " — లేనికోట నిలువకు సుమతీ "
10. " — జన్మించినపుడె పుట్టదు "
13. " బంగారు — కు "
14. " — పదివేలు చేరు గదరా సుమతీ "
15. " — సింహాసనమున కునకము "
17. " — మరణాంతకమౌనుగాని "
20. " రక్షదయ చుట్టంబా "
21. " దొరను గొల్చి కంటెన్ "

### నిలువు

1. " — మధురములగు భాషలుడిగి "
2. " — గొఱగామియే గాదు "
3. " — గలహింపకు "
4. " — నొక తీర్పరియైన "
6. " దనవారి కెంత గలిగిన — సుమతీ "
8. " — కిరవైన యట్లు "
10. " — దెచ్చి ఇచ్చిన "
11. " పురుషార్థపరుడు — సుమతీ "
12. " — నానార్థములున్ "
16. " — ఇంద్రభోగము "
18. " — జొచ్చునదే మగతనంబు "
19. " పరులకు మర్మము — "

జూన్ రంజనిమాల సమాధానములు 20వ పేజీలో

## సవరణ

మా నాన్నగారు ది 12-5-1986న దివంగతులైనారు. పొరపాటున ది 12-6-1986 అని జూన్ శ్రీవాణిలో పడింది. గమనించ ప్రార్థన. సంతాపమును తెలియబరుస్తూ చాలమంది స్నేహితులు, బంధువులు లేఖలు వ్రాసారు. వారికి నా కృతజ్ఞతలు.

కొమరగిరి కృష్ణమోహనరావు
సంపాదకుడు

జులై - 1986

సంపుటి : 2

సంచిక : 7

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు - కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818

చందా వివరాలు

విడిప్రతి : రు. 3-00

సంవత్సర చందా : రు. 33-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM

## విషయసూచిక

# సంపాదకీయం ఆచార్య దేవో భవ!

మన ముఖ్యమంత్రి శ్రీ యన్. టి. ఆర్ గారికి గురువులంటే అమితమైన శ్రద్ధాభక్తులు. ఉపన్యాసాలలో అప్పుడప్పుడు "ఆచార్య దేవో భవ!" "గురుర్దేవోభవ!" అని భక్తిపూర్వకంగా ప్రస్తావిస్తుంటారు. అందులో మన విద్యాశాఖామాత్యులు శ్రీ గాలి ముద్దుకృష్ణమనాయుడుగారు పూర్వాశ్రమంలో ఆచార్య వంశానికి చెందినవారె. వీరిరువురు మన రాష్ట్రంలో విద్యారంగమును సంస్కరించ సంకల్పించుకున్నారు. కాదు! కాదు! ప్రక్షాళన చేయ సంకల్పించుకున్నారు. నూతన విధానాలతో, ఆధునాతన పద్ధతులతో, వృత్తి విద్యా కోర్సులను ప్రవేశపెట్టాలని, వీడియోలద్వారా ప్రాథమిక పాఠశాలలో విద్యను బోధించాలని ప్రయత్నిస్తున్నారు. విద్యారంగంలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకురావాలని ఆకాంక్షిస్తున్నారు. వీరి ఆలోచనలు ప్రశంసించదగ్గవే. అయితే అవి ఎంతవరకు ఆచరణ రూపం దాల్చుతాయో! ఆచరణ సాధ్యం కానటువంటి ఆలోచనల వలన ఆశించిన ప్రయోజనం చేకూరదు గదా! ఉదాహరణకు వీడియోల ద్వారా విద్యాబోధన. దీనిని అమలుపరచే ముందు కొన్ని వాస్తవాలను పరిశీలించినట్లు కనిపించడంలేదు. రాష్ట్రంలో ఎన్ని ప్రాథమిక పాఠశాలలకు పైకప్పు ఉంది? ఎన్ని పాఠశాలలకు విద్యుచ్ఛక్తి ఉంది? ఎన్ని పాఠశాలల్లో ఫర్నిచర్ ఉంది? పంతుళ్ళు చేయి పుచ్చుకొని అక్షరాలు దిద్దిస్తుంటేనే అక్షరాలురాని పిల్లలకు వీడియోలు ఎంతవరకు ఉపయోగపడుతాయి? వీటిని గురించి ప్రభుత్వం ఆలోచించిందా? సినిమాలు చూచినట్లు చూచి పిల్లలు ఆనందంగా ఇంటి ముఖం పడుతారు. వారికి లోకజ్ఞానం వస్తే రావచ్చునేమోగాని, అక్షరజ్ఞానం మాత్రం అనుమానమే. ఈ విధానానికి నేను వ్యతిరేకిని మాత్రం కాదు. ఈ విధానాన్ని ఈ సంవత్సరం ప్రయోగాత్మకంగా కొన్ని పాఠశాలల్లో ప్రవేశపెట్టి, సాధక బాధకాలను పరిశీలించి, ఆశించిన ఫలితాలు చేకూరుతే, వచ్చే సంవత్సరం ఈ పథకమును విస్తృతపరచినట్లయితే బాగుండేది. అది చేయకుండా ఒకే పర్యాయం నూతన ప్రయోగాల కోసం భారీ ఎత్తున డబ్బు ఖర్చు చేయడం విజ్ఞత అనిపించుకోదు. అసలే ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్న ప్రభుత్వానికి ఇది మరింత భారమవుతుంది. ఈ దేశంలో విద్యారంగలో అనేక ప్రయోగాలు జరుగుతున్నాయి. మంత్రి వర్గాలు మారినప్పుడల్లా నూతన పథకాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. కొన్ని కేంద్ర పథకాలు, మరికొన్ని రాష్ట్ర పథకాలు, ఒకదాని కొకటి పొంతన ఉండటంలేదు. స్వాతంత్ర్యం వచ్చి 40 సం. కావస్తున్నా విద్యారంగం ఒక ప్రయోగశాలగానే నిలచిపోయింది. ఆశించిన ఫలితాలు మాత్రం చేకూరడంలేదు.

గతసంవత్సరాంతంలో అధ్యాపకులు సమ్మె చేసారు. ముఖ్యమంత్రిగారికి కోపం వచ్చిందో లేదోగాని, విద్యాశాఖామాత్యులు శ్రీ గాలి వారు మాత్రం ఆగ్రహించారు. కక్ష సాధింపు చర్య కాదంటూనే షుమారు 1700 మంది లెక్చరర్లను ఒకే పర్యాయం సుదూర ప్రాంతాలకు విసిరి వేసారు. వారికి టి. టి. ఏ లు; డి. ఏ లు; మరియు అడ్వాన్స్ పేమెంట్స్ పెద్ద మొత్తాలలో చెల్లించవలసి వచ్చింది. ఆర్థిక యిబ్బందులలో సతమతమవుతున్న ప్రభుత్వానికి యిది మరింత భారమైంది. ఆచార్యులు కూడా కోపోద్రిక్తులై ఉన్నారు.

మన రాష్ట్రంలో వివిధ రకాల విద్యాలయాలున్నాయి. 1. ప్రభుత్వ విద్యాలయాలు 2. స్థానిక సంస్థల విద్యాలయాలు (జిల్లాపరిషత్, సమితి, మున్సిపల్) 3. ప్రభుత్వం చేత గుర్తించబడి ప్రయివేటు యాజమాన్యం వారిచేత నడుపబడే విద్యాలయాలు (Full Aid; Half Aid; Un Aided) 4. ప్రభుత్వం గుర్తింపు పొందని ప్రయివేటు విద్యాలయాలు (కాన్వెంట్స్, ట్యుటోరియల్స్). కొంతమంది వ్యక్తులు విద్యను వ్యాపారంగా చేస్తున్నారని,

శ్రీవాణి

లక్షలు ఆర్జిస్తున్నారనే ప్రచారం ఒకటి ఉన్నది. కొంతవరకు వాస్తవమే అయితే అన్ని ప్రయివేటు విద్యాలయాలు సంపాదిస్తున్నారనుకోవడం మాత్రం వాస్తవం కాదు. ఒకటి మాత్రం యదార్థం. ప్రయివేటు విద్యాలయాలు కొంతమంది నిరుద్యోగులైన విద్యావంతులకు మాత్రం జీవనభృతిని యిస్తున్నాయి.

మన విద్యాశాఖామాత్యులు డొనేషన్స్ తీసుకోరాదని, ఫీజులు క్రమబద్ధం చేస్తామని చెబుతున్నారు. అంతవరకు అందరికీ ఆమోదయోగ్యమే. ఈ ఆలోచన మంచిదే. అయితే ప్రైవేటు విద్యాలయాలు, ప్రైవేటు ట్యూషన్స్, ట్యుటోరియల్స్ ఫీజులు కూడా క్రమబద్ధం చేయడం జరుగుతుందని విద్యామంత్రిగారు ప్రకటించారు ప్రభుత్వంచేత గుర్తించబడి, పూర్తి ఆర్థిక సహకారం [Full Aid] పొందుతున్న విద్యాలయాల ఫీజులు అదుపు చేయడంలో ఎవరికీ ఎట్టి అభ్యంతరంలేదు. సగం ఆర్థిక సహకారం [Half Aid] పొందిన విద్యాలయలవారు ఫీజులు వసూలు చేయరాదని, స్కేలు ప్రకారం ఉపాధ్యాయులకు జీతాలు యివ్వాలని కోరడం ఎంతవరకు సబబు? అంతేకాదు ప్రభుత్వంచేత గుర్తించబడి, ఏ మాత్రం ఆర్థిక సహకారం పొందని [Un Aided] విద్యాలయాలవారు సహితం ప్రభుత్వం నిర్దేశించిన ఫీజులు మాత్రమే వసూలు చేయాలి, స్కేలు ప్రకారం ఉపాధ్యాయులకు జీతాలివ్వాలని కోరడం ఎంతవరకు న్యాయం? స్కూలు నిర్వహణ అంటే కేవలం ఉపాధ్యాయుల జీతాలే కాదు. అద్దెలు, ఎస్టాబ్లిష్‌మెంట్ ఖర్చులు, ఫర్నిచర్, లేబరేటరీ ఖర్చులేగాక యింకా ఎన్నో ఖర్చులుంటాయి. ఒక్కొక్క విద్యార్థిమీద ఎంత డబ్బు ఖర్చు చేస్తున్నదో ప్రభుత్వానికి అనుభవంలేదా? పూర్వాపరాలను, వాస్తవిక విషయాలను పరిగణనలోనికి తీసుకొనకుండా, ప్రజల మెప్పును పొందాలనే తాపత్రయంలో అనాలోచితమైన, అవాస్తవికమైన ప్రకటనలు చేయడం, తొందరపాటు నిర్ణయాలను గైకొనడం ప్రభుత్వాధినేతలకు భావ్యం కాదు.

ఇకపోతే ప్రయివేటు కాన్వెంట్స్, ప్రయివేటు విద్యాలయాలు, ట్యుటోరియల్స్ మీద విద్యాశాఖ మంత్రిగారు దాడి చేయడం న్యాయం కాదు. అసలు ఇవి పుట్టగొడుగుల్లా ఎందుకు పెరుగుతున్నాయి? ఈ విద్యాలయాలలో పిల్లలను ఎందుకు చేరుస్తున్నారు? ఎవరు చేస్తున్నారు? ఇవి పెరగడానికి అసలు బాధ్యులెవరు? ఆలోచిస్తే దీనికి బాధ్యత పూర్తిగా ప్రభుత్వానిదే. 1. ప్రభుత్వ, స్థానిక సంస్థల విద్యాలయాలలో తల్లిదండ్రులు ఆశించినంత చదువు లేకపోవడం. 2. విద్యార్థులందరికి కావలసిన సీట్లు యివ్వలేకపోవడం. 3. ప్రతి దానికి ఎంట్రెన్స్ పరీక్షలు పెట్టడం వలన ప్రయివేటు విద్యాలయాల సంఖ్య పెరుగుతున్నది. ఈ మూల విషయాలను పరిశీలించకుండా, ప్రభుత్వ అధీనంలో ఉన్న విద్యాలయాలను మెరుగు పరచకుండా ప్రయివేటు విద్యాలయాల మీద ప్రభుత్వం దాడి చేయడం శోచనీయం. "అమ్మ పెట్టదు అడుక్కోనివ్వదు" అన్నట్లు ఉన్నది ప్రభుత్వ విధానం. ప్రయివేటు విద్యాలయాలతోపాటు పోటీగా, అంతకన్నా మిన్నగా ప్రభుత్వ అధీనంలో ఉన్న విద్యాలయాలను నడిపించినప్పుడు తల్లిదండ్రులు ప్రయివేటు విద్యాలయాల పైపు పరుగెత్తరు. ప్రయివేటు విద్యాలయాలు వాటంతట అవే అదృశ్యమైపోతాయి. అది చేయకుండా ప్రయివేటు విద్యాలయాలను దెబ్బకొట్టడానికి ప్రయత్నించుతే చివరకు నష్టపోయేది విద్యార్థులు మాత్రమే. ఏ రంగంలోనయినాసరే ప్రయివేటు, ప్రభుత్వరంగాల మధ్య ఆరోగ్యకరమైన పోటీ [Healthy Competition] ఉన్నప్పుడే ప్రజలు సుఖపడుతారు. ఈ విషయాన్ని విస్మరిస్తే ప్రతి రంగంలో సంక్షోభం తప్పదు.

ప్రభుత్వ అధీనంలో నడుపబడుతున్న విద్యాలయాలలో పనిచేసే ఉపాధ్యాయులు కూడా తమ వృత్తి ధర్మాన్ని నిర్వర్తించాలి. కొంతమంది తమ విద్యుక్త ధర్మాన్ని విస్మరిస్తున్నారు. ప్రయివేటు ట్యూషన్స్‌ను ప్రోత్సహిస్తున్నారు. ఇది అత్యంత ప్రమాదకరం. ఆర్థికస్తోమతలేని పేద, బీద విద్యార్థులెందరో ఉన్నారు. వారికి ప్రభుత్వంచేత నడుపబడే విద్యాలయాలే శరణ్యం. అక్కడ వారికి ఉపాధ్యాయులు సరీగా చదువు చెప్పకపోతే వారి గతేం కావాలి? ఈ వాస్తవాన్ని ఉపాధ్యాయులు కూడా గుర్తించాలి. మానవతాదృష్టిని ప్రదర్శించాలి. కేవల హక్కులం (Rights) కోసం పోరాడటమే కాదు, బాధ్యతల [Duties]ను కూడా గుర్తించి మెలగాలి. అన్ని దానాలలోనికి విద్యాదానం ఉత్తమమైనదని ఉపాధ్యాయులు గుర్తించిన రోజున "ఆచార్య దేవోభవ!" అని మొత్తం సమాజం అధ్యాపకులను పూజిస్తుంది. ఆ శుభదినం కోసం ఎదురుచూద్దాం. 

శ్లో॥ జిహ్వోపస్థ సుఖభ్రమం త్యజమనః ! పర్యంత దుఃఖేక్షణాత్
పారుష్యం మృదుభాషణాత్త్యజ; వృథాలాప శ్రమం మౌనతః
దుస్సంగం త్యజ సాధు సంగమ బలాత్, గర్వంతు భంగేక్షణాత్
నిందా దుఃఖమనింద్య దేవముని దుర్నిందా కథా సంస్మృతేః ॥

మనలో దుర్వాసనలు చాలా వున్నాయి. వాటిని పోగొట్టుకోవటానికి కొన్ని సువాసనల వలవాటు చేసుకోవాలి. శ్రేయోమార్గానికి దుర్వాసనలు నిరోధకాలు. ఏ దుర్వాసన యే వుపాయంతో పోతుందో చక్కని పద్ధతి వుపదేశించారు జగద్గురువులు శంకరులు.




నాలుక మొదలైనవి జ్ఞానేంద్రియాలు. అవి అయిదు. అలాగే కర్మేంద్రియాలు చర్మము మొదలైనవి అయిదు. ఈ పది ఇంద్రియాలకు లొంగని జీవుడుండడు. ఎంత పండితుణ్ణయినా పెడదారి తొక్కించేవి ఈ యింద్రియాలే. ఈ ఇంద్రియాల కధిపతి మనస్సు. ఇదికూడా ఇంద్రియమే. అయితే ఇది చాలా ప్రధానమైనది. ఇంద్రియాలు వాటి విషయాల మీదకు ప్రసరించి ఆ విషయ సుఖాన్ని మనస్సు కందిస్తాయి. అంటే మనస్సు ఆయా ఇంద్రియం ద్వారా విషయంలో లగ్నమై ఒక సుఖాన్ని అనుభవిస్తుంది. ఇదిగో యీ యింద్రియ సుఖానుభవమే దుర్వాసనంటే. నిజంగా యిది సుఖంకాదు. సుఖంలాగా కనబడి చివరికి గోతిలో పడేస్తుంది. అందుకని ఇంద్రియాలవల్ల కలిగే విషయ సుఖం మనస్సుకు దూరంగా వుంచాలి. ఈ అబద్ధపు సుఖాల ననుభవించటానికెన్నో బాధలు పడాలి. అట్లాగే అనుభవించినతర్వాత క్షణంలో సుఖం పోయిందే అని దుఃఖిస్తాడు మనిషి. అంటే ఈ సుఖానికి ముందు తర్వాత కూడా దుఃఖమన్నమాటేగా. ఇది తెలియక ఇంద్రియ సుఖాలకు మనస్సు పరుగెత్తుతున్నది. ఇది ఆద్యంత దుఃఖం అనే సత్యాన్ని తెలుసుకొని మన మనస్సును ఇంద్రియ విషయాల చాయకే పోకుండా చేసుకుంటే సరిపోతుంది. అప్పుడు నిజమైన సుఖం తెలుస్తుంది.

కొంతమంది మాట్లాడితే కట్టె విరిచినట్లుంటుంది. అంత పరుషంగా వుంటుందన్నమాట. పరుష వాక్కువల్ల యితరుల మనసు నొచ్చుకొంటుంది. కనుక వాక్పారుష్యం పనికిరాదన్నారు. అది అగ్నికంటే చురుకైనది. విషం కంటే ఘోరమైనది. దీన్ని వదిలించుకోటం యెట్లా? ఈ దుర్వాసన పోవాలంటే ఒకరుల మనస్సు నొచ్చుకోని విధంగా మృదుమధురంగా మాట్లాడటం అలవాటు చేసుకుంటే సరి. మెత్తగా చిత్తం హత్తుకొనేలాగా మాట్లాడే వారికి అందరూ మిత్రులే. పారుష్యంవల్ల శత్రుత్వం కొనితెచ్చుకోవటమే. "నోరు మంచిదైతే వూరు మంచిదవుతుంద"న్నారు పెద్దలు.

అలాగే మౌనంకూడా చాలా గొప్పది. దానివల్ల వాక్శక్తి పెరుగుతుంది. ఎవరితోనూ కలహాలు రావు. ఎక్కువగా వాగటంవల్ల వచ్చేశ్రమ మౌనంవల్ల పోతుంది. ఎక్కువ మాట్లాడటం కూడా దుర్వాసనే. దానివల్ల అసత్యాలు పలకటం అలవాటయిపోతుంది. అసత్యాది దోషాలు పోవాలంటే మౌనంకంటే మంచి మందు లేదు.

దుష్టులతో సహవాసం, స్నేహం చాలా ప్రమాదకరం. దానివల్ల మనిషికి యిహపరాలు రెండూ దక్కవు. దీన్ని వదిలించుకోవాలంటే తప్పక సజ్జన సాంగత్యం చేయాలి. సత్సంగం జీవన్ముక్తికి కారణమని ఆచార్యస్వామి చెప్పనే చెప్పారు. కనుక దుస్సంగ దోషం పోగొట్టుకోటానికి సత్సంగ బలం సంపాదిస్తే చాలు.

లోకంలో ఎంతోమంది నాఅంతవారు లేరని ధనాది గర్వంతో విఱ్ఱవీగి చివరికి అవమానంపాలయినారు. పురాణాల్లో అలాంటి అవమానం పొందినవారి కథలు విన్నాం. లోకంలో చూస్తున్నాం కనుక అదితెలుసుకొని గర్వమనే దుర్వాసన దూరంచేసుకోవాలి.

కొంతమంది పరదూషణం చేస్తారు. వారిచేత తిరిగి నిందింపబడతారు. ఈ రెండూ దుఃఖాన్నే కలిగిస్తాయి. నిందింపదగని దేవతలను, మునులను, సాధువులను, సజ్జనులను నిందించి వారికి సంతాపం కలిగించిన దుర్మార్గులు అనుభవించిన పాప ఫలితాలను గుర్తుచేసుకుంటూండటం మంచిది. సజ్జన నిందవల్ల గలిగిన దుష్ఫలితాలను తెలుసుకుంటే పరనింద అనే దుర్వాసన నశించిపోతుంది.

శంకరులు చెప్పినట్లు అభ్యాసంచేస్తే మనలోని దుర్వాసనలు తప్పక తొలిగిపోతాయి.



# దేశమంతటా ఒకే విద్యావిధానం ఉండాలి

తెలుగులో ఒక సామెత ఉంది. "కోడలు నలుపైతే కులమంతా నలుపేనట!" విద్యావిధానం తప్పు మార్గం పడితే దేశమంతా తప్పు మార్గం పడుతుంది. విద్యావిధాన మనే గృహానికి, జాతికి విద్య కోడలు. విద్య సరైన మార్గంలో లేకపోతే దేశమే క్షీణించిపోతుంది. విద్యార్థులు సరైన స్థితిలో ఉంటే దేశ భవిష్యత్తును ఎంతైనా అభివృద్ధి గావించుకోవడానికి అవకాశముంటుంది. కనుక విద్యా విధానం విషయంలో అలక్ష్యం చేయరాదు. ఇందులో ప్రభుత్వం బాధ్యత ఎంతైనా ఉన్నది. అయితే ఒక్కొక్క క్రొత్త మంత్రి వచ్చినప్పుడు ఒక్కొక్క క్రొత్త పద్ధతి మారుతూ వుంటుంది. ఈ మార్పుల చేతనే విద్యార్థుల హృదయాలు చాలా వరకు ఉద్రేకాలకు లోనయ్యే అవకాశాలు ఏర్పడుతున్నాయి. సమస్యలను సకాలంలో పరిహరింప జేసే పద్ధతిని అవలంబించడంలేదు. తద్వారా విద్యార్థుల అభివృద్ధి క్షీణించిపోతున్నది. ఆలోచించగల ప్రతి మానవుని అయోమయ స్థితిలో ముంచెత్తే సమస్యలు ఈనాడు విద్యారంగంలో విరివిగా కనిపిస్తున్నాయి. నిత్య జీవితానికి సంబంధించిన ప్రతి రంగాన్ని పుష్టికరంగా తీర్చిదిద్దినప్పుడే విద్యకు విలువ. విద్యారంగం ఈనాడు కేవలం యాంత్రికమైపోయినది. విద్యలో చైతన్యంగాని, నైపుణ్యంగాని కనిపించడంలేదు. విద్య కేవలం కృత్రిమమై పోయినది. విద్యలో వినయం విధిగా ఉండి తీరాలి. సత్యము, ప్రేమ, సహనము, సానుభూతి మొదలైన మానవత్వ గుణములు విద్యారంగంలో ఏ మాత్రం కనిపించడంలేదు. ఇది మిక్కిలి ప్రమాదం.

## ఎడ్యుకేషనా? ఎజిటేషనా?

విద్యలో శీలము, పవిత్రతలకు ప్రత్యేక స్థానం ఉండాలి. పవిత్రత అన్నా, శీలమన్నా అర్థం కాని స్థితిలో ఉన్నారు నేటి విద్యావంతులు. Education (విద్య) అంటూ Agitation (ఆందోళన) ను ప్రేరేపిస్తున్నారు. గురువులు Agitation (ఆందోళన) కాదు Elevation (వికాసాన్ని) ప్రదర్శించాలి. పవిత్ర మార్గంలో ప్రవేశించిన వ్యక్తినే విద్యావంతుడనడానికి వీలవుతుంది. బహుళ గ్రంథ పరిచయం విద్య కానేరదు. పదవులు అక్రమించినంత మాత్రమున, పదములకు అర్థం వివరించినంత మాత్రమున విద్యావంతుడు కానేరడు. విద్య హృదయ కవాటమును తెరిపింపజెయ్యాలి. నైతిక, ఆధ్యాత్మిక శీల సంపదను ఇనుమడింపజేయని విద్య విద్యయే కానేరదు. అట్టి పవిత్రత దూరం కావడం చేతనే ఎక్కడ చూచినా అశాంతి, అక్రమము, అనాచారము, అసత్యము ప్రబలి పోతున్నాయి.

శ్రీ సత్యసాయిబాబా

## ఉద్యోగాల కోసమా?

నేడు ఉద్యోగం కోసమే విద్య అనే భావం పిల్లలలో పాదుకొనిపోయింది. ఈ భావమును పిల్లల హృదయము నుండి తీసివేయాలి. విద్య విజ్ఞాన సముపార్జన నిమిత్త మని వారికి బోధించాలి. మంచి మాటలచేత పిల్లల హృదయాలను కరిగించవచ్చును. బ్రిటీషువారి పాలనలో తద్విరుద్ధంగా జరిగింది. ఆనాడు ఉద్యోగాలు చేసేవారు అవసరమైనారు. ఉద్యోగాల నిమిత్తం విద్యను అభ్యసింప జేసాడు మెకాలె. భారతీయులను భావాలలో, గుణాలలో కేవలము బ్రిటీషువారిగా తయారుచేయాలని మెకాలె ఉద్దేశ్యము. ఆనాడు ఉద్యోగాల నిమిత్తము విద్య ప్రారంభ మైనది. అయితే ఈనాడు విద్య నిమిత్తమై ఉద్యోగాలు అవసరమైన పరిస్థితి ఏర్పడినది. నా ఉద్దేశ్యంలో విద్యార్థుల

యందు ఏ దోషములేదు. వారు కొండలలో ఉంచే గుండు బండల వంటివారు. శిల్పి ఏ రూపాన్నిస్తే బండ ఆ రూపాన్ని ధరిస్తుంది. అధ్యాపకులే శిల్పులు. ఇంటిలో తల్లిదండ్రులు, విద్యాలయంలో అధ్యాపకులు సరియైన ఆదర్శాన్ని నెలకొల్పినప్పుడు విద్యార్థులు చెడటానికి అవకాశంలేదు.

## విద్య స్వతంత్రంగా వుండాలి

ఈనాడు విద్యావిధానము సరియైన మార్గానికి రావాలంటే ఒక్కటే దీనికి పరిహారము. సరైన విద్యావిధానమే సమాజానికి రక్ష. విద్యను చక్కగా పోషించినపుడు దేశానికి రక్షణ చేకూరుతుంది. విద్యను రక్షించి చక్కగా పోషించాలంటే ఏమిచేయాలి ? సహృదయ భావంతో నేను యోచిస్తున్నాను. దేశం ప్రశాంతిని నేను ఆశిస్తున్నాను – పవిత్రమైన భారతీయుల అభివృద్ధిని కోరి వీరిని ఉన్నత స్థితికి కొనిపోయే మార్గాన్ని వెతుకుతున్నాను. స్వార్థపూరితమై సహజ ప్రేమ కాకుండా త్యాగపూరితమైన దివ్యప్రేమ ఆధారంగా గల విద్య స్వేచ్ఛగా జగత్తంతా వ్యాపించాలంటే విద్యారంగము ప్రభుత్వం నుండి వేరు కావాలి. ఏవిధంగా న్యాయస్థానములు స్వతంత్రమైన రీతిగా అభివృద్ధి అవుతున్నాయో, అదే విధముగా విద్యకూడా స్వతంత్రంగా వుండాలి. దీనికి కొంతమంది విద్యావేత్తలు, అనుభవజ్ఞులైన వారితో ఒక సంస్థను, దీని మంచి చెడ్డలు విచారించగల అధికార స్థాయిలో స్థాపించాలి. ప్రభుత్వం చేతిలో దీనిని పెట్టినట్లయితే స్వప్రయోజనాలకు, స్వార్థాలకు ఉపయోగించడం వల్ల, విద్యాసంస్థ లక్ష్యాలకు భిన్నమైన పరిస్థితి ఏర్పడుతుంది.

## ఒకే విద్యావిధానం

విద్యా పద్ధతియందు మనం అవలంబించవలసిన ముఖ్యాంశములు రెండు వున్నవి. ఒక్కొక్క రాష్ట్రములో ఒక్కొక్క పద్ధతిని అవలంబిస్తున్నారు. భారత దేశమంతటా విద్యావిధానం ఒకేవిధంగా వుండాలి. మద్రాసు రాష్ట్రంలో నున్నవారు, ఉద్యోగ కారణాలవల్ల కర్ణాటకకు బదిలీ కావచ్చు. కర్ణాటక రాష్ట్రంలో నున్నవారు యు. పి. కి మారవచ్చు. బదిలీ అయిన తండ్రి, పిల్లలను తీసుకొని పోయేట్టులేదు. అక్కడే ఉంచేట్టులేదు విద్య అంతటా ఒకేవిధంగా ఉంటే ఎక్కడికి వెళ్ళినా విద్యార్థికి ఏవిధమైన ఇబ్బంది ఉండదు. ఇందుకు మనం అవలంబించవలసిన పద్ధతులేమిటి ? ప్రిన్సిపాళ్ళు, వైస్ ఛాన్సలర్లు ఇది చక్కగా విచారణ చేయాలి. ఏప్రియల్ మొదటివారంలో పరీక్షలు ప్రారంభమై 20 లోగా పూర్తి కావాలి. జూన్ రెండవ వారానికి ఫలితాలు ప్రకటించాలి. ఈ పద్ధతి చక్కగా పాటిస్తే విద్యార్థి ఏ పోస్టుకో, ఏ కోర్సుకో పోవటానికి ప్రయత్నిస్తాడు. అట్లు కాకుండా ఒక్కొక్క రాష్ట్రంలో ఒక్కొక్కసారి ఫలితాలు వస్తుంటాయి. ఒక రాష్ట్రం విద్యార్థికి మరో రాష్ట్రంలో సీటు చిక్కడానికి అసలే అవకాశం ఉండదు. కొన్ని సందర్భాలలో ఎక్కడా సీటు దొరకక సంవత్సరకాలం వ్యర్థం చేసుకోవలసివస్తున్నది. వైస్‌ఛాన్సలర్లు అందరూ ఈ విషయం ఆలోచించి సరైన సద్ధతిని రూపొందిస్తే విద్యార్థులకు ఎంతైనా ఉపకారం చేసినవారవుతారు.

## విద్య ఉచితం

విద్యకు ధనమునకు ఏ మాత్రం సంబంధముండ కూడదు. ఈ జూన్ నుండి మా యూనివర్సిటీలో విద్య ఉచితం. విద్య ఉచితంగా బోధించడం ద్వారా సరైన పద్ధతిలో పిల్లలను చక్కదిద్దవచ్చును. వాళ్ళ జీతాలు కట్టడం, ఆ డబ్బుతో సంస్థను అభివృద్ధి గావించుకుంటే మనం వారి చేతిలో కీలుబొమ్మలమైపోతాం. ధనసంబంధం లేనప్పుడు వారు మన చేతిలో కీలుబొమ్మలుగా నిలుస్తారు. అప్పుడు వారిని మనం సరైన రీతిలో తరిఫీదు చేయవచ్చు నైతిక ఆధ్యాత్మిక శీలసంపత్తిని ఇనుమడింపజేసే గుణములను వారికి అలవరచవచ్చు. ఈ మధ్య స్కూళ్ళలో నీతిబోధ తరగతులంటూ పెట్టారు. పేరుకు నీతిబోధ. ఆ తరగతులలో ఏమి చెబుతున్నారో తెలియదు. ఉపాధ్యాయులకు కూడా సరైన శిక్షణ యివ్వాలి. కేవలం విద్యాబోధనే గాక, నీతి నిజాయితీలను కూడా బోధించడానికి ంచాలి.

## ప్రేమ విద్య

విద్యార్థులలో బాల్యంనుండే ప్రేమను పెంచాలి. ప్రేమ వల్లనే ఐక్యత పెరుగుతుంది. ప్రేమ లేకపోతే ద్వేషం ప్రబలుతుంది. ఈనాడు అక్షరశూన్యుడు అంత అపకారం చేయడంలేదు. చదువుకున్న వ్యక్తులే దేశానికి అపకారం చేస్తున్నారు. తోటి మానవులను అపహరిస్తున్నారు. లూటీలు, దోపిడీలు చేస్తున్నారు. విమానాలను, తదితర వాహనాలను దారి మళ్ళిస్తున్నారు. వీరంతా విద్యావంతులే కదా! ఇదా చదువు నేర్పే సంస్కారం? కాదు, కాదు. మనం మానవజాతిని ఉద్ధరించాలి "పరోపకారార్థ మిదం శరీరం" పరోపకార నిమిత్తమే శరీర మేర్పడినది. ప్రేమచేత ప్రేమ ద్వారా ప్రేమను సాధించాలి. ప్రేమతో సాధించలేనిది ఒక్కటీ కూడాలేదు. నా స్వభావమే ప్రేమ. నా ప్రేమ చేతనే నేను నిరంతరం ఆనందంగా ఉంటున్నాను. నేనంటే ద్వేషమున్న వారు ఉండవచ్చును. నాకు ఎవ్వరిమీద ద్వేషం లేదు. వారికి ద్వేషముంటే ఉండుకోనీ. ఒక చేయి చరిస్తే శబ్దముండదు. రెండు చేతులు చేరితే శబ్దమవుతుంది. నాకు ఏ కోశాన ద్వేషం లేదు కనుక ఏ విధమైన అశాంతి, అలజడి నాకు లేదు. ప్రేమే మానవత్వం. మానవత్వమే ప్రేమ. ప్రేమ చేతనే విద్యను అభివృద్ధి పరచాలి. పిల్లలను చక్కగా అభివృద్ధి పరచి భావిభారతోద్ధారకులుగా తయారు చేయాలి. ఇదే నా ఆకాంక్ష. ★

(మ్యూజిక్ అకాడమీ హాల్, మద్రాసులో యిచ్చిన ఉపన్యాసం నుండి (20-1-86))

# లోకమాన్య బాలగంగాధరతిలక్

లోకమాన్యుడు ఒక వ్యక్తి కాదు. ఒక మహోద్యమం. ఆయన ఒక మహాసంస్థ. "స్వరాజ్యం నా జన్మహక్కు" అని సింహగర్జన చేసిన మహావీరుడు. ఆ గంభీర గర్జనతో బ్రిటీషు సామ్రాజ్యము గజగజలాడింది. నిద్రాణమైఉన్న భారతజాతి మేల్కొంది. భారత యువత ఉవ్వెత్తున లేచింది. రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యాన్ని కూకటివేళ్ళతో పెకలించివేయడానికి భారతీయులు నడుం బిగించారు. ఆయన యిచ్చిన నినాదంతో కాంగ్రెసు, జాతీయ మహోద్యమంగా మారిపోయింది.

కొమరగిరి కృష్ణమోహనరావు

భారతజాతీయ జీవనంలో ఒక నూతన క్రాంతి మెరిసింది. అప్పటివరకు స్వతంత్రపునకు నిర్వచనం బ్రిటీషువారిని పారద్రోలడం వరకే పరిమితమైంది. ఆ సమయంలో లోకమాన్యుడు నిర్దుష్టమైన పంథాను రూపొందించి ప్రజలకందించాడు. సంవత్సరాల తరబడి బ్రిటీషువారి ఉక్కుపాదాల క్రిందపడి నలిగిపోతున్న పీడిత ప్రజల సముద్ధరణకు కృతనిశ్చయుడై రాజకీయ రంగప్రవేశం చేసాడు. బ్రిటీషువారి దయా దాక్షిణ్యాలకు లొంగేది లేదని, వారి కరుణా కటాక్షం మీద ఆధారపడి, సంతృప్తికరణ విధానాన్ని ప్రదర్శించేది లేదని, సంపూర్ణ స్వాతంత్ర్యం సిద్ధించేంతవరకు ఎన్ని త్యాగాలకైనా వెనుకాడేది లేదని, స్వాతంత్ర్యం భారతీయుల జన్మహక్కని ఎలుగెత్తి చాటాడు. తరతరాలుగా భారతావనిని పునీతం చేసిన భారతీయ సంస్కృతీ సాంప్రదాయాలు పునాదిగా జాతీయ సౌధ నిర్మాణం జరగాలని వాంఛించాడు. తిలక్ స్వాతంత్ర్యోద్యమమును జాతీయ సాంప్రదాయాలతో మేళవించాడు. గణేశ ఉత్సవాలను సామూహికంగా జరిపించి ప్రజలను జాగృతం చేసాడు. దేశ సేవకే తన జీవితాన్ని అంకితం చేసాడు. న్యాయశాస్త్రంలో ఉత్తీర్ణుడైనప్పటికీ న్యాయవాద వృత్తిని చేబట్టలేదు. మరి ఏ ఇతర ఉద్యోగాలను ఆశించకుండా ఉత్తమమైన, పవిత్రమైన బడిపంతులుగా జీవితంలో అడుగుపెట్టాడు. ఉపాధ్యాయుడుగా జీవితాన్ని కొనసాగిస్తూ ఇంగ్లీషులో 'మరాఠా' పత్రికను, మహారాష్ట్ర భాషలో 'కేసరి' పత్రికను నడిపారు. బ్రిటీషువారి కుటిల రాజనీతిని, వారి నియంతృత్వ పోకడలను నిర్భయంగా ఆ పత్రికలలో విమర్శించేవాడు తిలక్. ఎక్కడ ఏమాత్రం అన్యాయం జరిగినా సహించేవాడు కాదు.

కాంగ్రెసు 1885 సం. లో స్థాపించబడింది. ఆ తరువాత నాల్గు సంవత్సరాలకు తిలక్ కాంగ్రెసులో ప్రవేశించాడు. ఆనాడు ఇంగ్లీషు వచ్చిన వారికే కాంగ్రెసులో సభ్యత్వం లభించేది. అది ఆయనకు నచ్చలేదు. ఆయన కృషి ఫలితంగా అందరికీ కాంగ్రేసులో చేరే అవకాశం లభించింది. యాచించడం భిక్షకుల లక్షణమని తిలక్ అభిప్రాయం. యాచించడం ద్వారాను, ఆశ్రయించడం ద్వారాను స్వాతంత్ర్యం సంపాదించాలనుకోవడం భారత జాతి గౌరవ ప్రతిష్ఠలను మంట కలపటమేనని తిలక్ భావించారు. కష్టపడి, పోరాటం ద్వారా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవాలని ఆయన ప్రజలకు ఉద్బోధించారు. అయితే తిలక్ ధోరణి కొంతమందికి రుచించలేదు. యువకులు మాత్రం తిలక్‌ను అనుసరించారు. కాంగ్రేసు సభ్యులలో మితవాదులు, అతివాదులని రెండు వర్గాలు ఏర్పడ్డాయి. అతివాదులు తిలక్‌ను అనుసరించారు.

తిలక్ వ్యాసాలు, ఉపన్యాసాలు ప్రజలలో ఉత్తేజాన్ని కలుగజేసేవి; సంచలనాన్ని సృష్టించేవి. తిలక్ పూనా పురపాలక సంఘ సభ్యుడిగా ఉండే రోజులలో అతి

భయంకరమైన ప్లేగ్ వ్యాధి విలయతాండవం చేసింది. అప్పుడు తిలక్ చేసిన సేవ ప్రజల నెంతో ఆకర్షించింది. బ్రిటీష్ ప్రభుత్వం సహాయ చర్యలను తీసుకోవటానికి రాండ్ దొర అధ్యక్షతన ఒక సంఘమును నియమించింది. ఆ సహాయ కార్యక్రమాలలో ఆంగ్ల సైనికులు అతి క్రూరంగా వ్యవహరించారు. ప్రజలను పీడించారు దీని వలన ప్రజలలో గొప్ప అలజడి బయలుదేరింది. ప్రభుత్వం నుండి అవసరమైన సహాయం లభించకపోవడంవలన ప్రజలలో అసంతృప్తి జ్వాలలు మిన్ను ముట్టాయి. తెల్లవారి చర్యలను తిలక్ తీవ్రంగా విమర్శించాడు. ఆ పరిస్థితులలో రాండ్ దొరను ఎవరో చంపి వేసారు. ఈ హత్య వెనుక తిలక్ హస్తం ఉండి ఉంటుందని బ్రిటీషు వారు భావించారు. ఈ అలజడికి మూలకారణం తిలక్ వ్రాతలేనని ఆంగ్లేయ ప్రభుత్వం భావించి తిలక్‌కు 18 నెలలు కఠిన శిక్ష విధించింది.

కాంగ్రెసులో తిలక్ అనుయాయుల సంఖ్య నానాటికీ పెరుగుతూ వచ్చింది. 1906 లో కాంగ్రెసు అధ్యక్ష పీఠమును అలంకరించిన దాదాభాయి నౌరోజీ సహితం తిలక్ అతి సామాన్యంగా తరచుగా ఉచ్చరించే "స్వరాజ్య" పదమును అధ్యక్ష స్థానం నుండి పేర్కొని, అదియే కాంగ్రెసు లక్ష్యమని ఎలుగెత్తి చాటాడు. 1907 సూరత్ కాంగ్రెసులో కూడా తిలక్ చేయి మిన్నయింది. మిన్ను ముట్టుతున్న తిలక్ పలుకుబడిని చూచి ఆంగ్ల ప్రభుత్వం భయపడింది. ఒక చంప తిలక్ ఉపన్యాసాలకు ప్రజలు విరివిగా హాజరవుతున్నారు. విదేశీ వస్తువులను బహిష్కరించాలని, బ్రిటీష్ వారితో సహకరించరాదనే తిలక్ ఆలోచనలకు ప్రజల నుండి మరింత సహకారం లభించింది. అది చూచిన ఆంగ్ల ప్రభుత్వం ఏదో విధంగా తిలక్‌ను నిర్బంధించాలని నిశ్చయించుకున్నది. 1908 జూన్ 24న అనేక నేరాలు ఆయన మీద మోపి బర్మాలోని మాండలే జైలుకు ఆంగ్ల ప్రభుత్వం తిలక్‌ను పంపింది. ఆయనకు ఆరు సంవత్సరాలు కఠిన శిక్ష విధించబడింది.

మాండలే జైలు జీవితమును ఆయన చక్కగా సద్వినియోగం చేసుకున్నారు. ఆ కాలంలో భగవద్గీతకు మహారాష్ట్రి భాషలో చక్కని వ్యాఖ్యానం వ్రాసారు. దానిపేరు ''గీతారహస్యం''. విడుదల అయ్యేటప్పుడు వ్రాతప్రతిని తనతో తీసుకొనిపోవడానికి జైలు అధికారులు నిరాకరించారు. అప్పుడు తిలక్ " కాగితంమీద వ్రాసింది తీసుకోగల్గుతారుగాని మనస్సులోని భావాలను తమరు తీసుకోలేరుగదా ! " అని అధికారుల మొహాన ఆ పుస్తకం విసిరి పారేస్తాడు. ఈ సంఘటన ఆయన ఆత్మవిశ్వాసాన్ని, స్వాభిమానాన్ని ఋజువు చేస్తుంది. ఆ శిక్ష అనుభవిస్తున్న తరుణంలో ఆయన భార్య మరణిస్తుంది. ఆమె మృతదేహాన్ని చూడటానికి కూడా ఆంగ్ల ప్రభుత్వం అనుమతించదు. అంత్యక్రియలకు వెళ్ళడానికి అంగీకరించదు. క్రీ. శ. 1856 జులై 23వ తేదీన జన్మించిన తిలక్‌కు 16వ ఏటన వివాహం అవుతుంది. షుమారు 46 సంవత్సరాలపాటు భార్యతో సహజీవనం నెరపిన తిలక్ మహాశయునికి చివరిదశలో భార్యదగ్గర ఉండే పరిస్థితికూడా లేకుండాపోయింది. కనీసం ఆమె మృతదేహమును సందర్శించే భాగ్యంకూడా ఆయనకు లభించలేదు. ఇది నిజంగా దురదృష్టకరం. ఈ దుస్థితికి కారణభూతులు హృదయం లేని కటికి కసాయి ఆంగ్ల ప్రభుత్వం కాదా ! ఎందరో మహానుభావులు స్వాతంత్ర్య సమర పోరాటంలో అనేక ఇక్కట్లకు గురైనారు. అనేక త్యాగాలు చేసారు. ఎంతోమంది బ్రిటీషువారి ఉరికంబాలకు బలైపోయారు. తుపాకిగుండ్లకు ఆహుతి అయినారు. అటువంటి అమర వీరులను ఈనాడు భారతజాతి విస్మరిస్తున్నదేమోననిపిస్తున్నది. స్వాతంత్ర్య భిక్షపెట్టిన అట్టి మహనీయులను విస్మరించడం న్యాయమా ?

తిలక్ హైస్కూలులో చదివే రోజులలో ఒక చిన్న సంఘటన జరిగింది. ఒకరోజున ఎవరో కొందరు విద్యార్థులు వేరుశనక్కాయలు తిని తొక్కలు క్లాసురూంలో పడేశారు. కాగితాల ముక్కలు విరజిమ్మారు. ఆ తరగతి పంతులుగారు వచ్చి " ఎవరాపని చేసింది " అని ప్రశ్నిస్తారు. ఎవరూ సమాధానం చెప్పరు. పంతులుగారికి

కోపం వస్తుంది. గదంతా శుభ్రంగా ఊడవండని పిల్లల్ని పంతులుగారు ఆదేశిస్తారు. పిల్లలు ఊడవడం మొదలు పెడతారు. కాని ఒక్క విద్యార్థి మాత్రం ఆ పని చేయకుండా నిలబడి వుంటాడు. ఆ విద్యార్థివైపు పంతులుగారు తీక్షణంగా చూస్తాడు. కోపోద్రిక్తుడై హూంకరిస్తాడు. అయినప్పటికి ఆ విద్యార్థి ఏ మాత్రం చలించడు. పంతులుగారికి మరింత కోపం వస్తుంది. పంతులుగారు ఒక బెత్తం తీసుకుని నిర్భయంగా నిల్చొని ఉన్న ఆ విద్యార్థి వద్దకు వచ్చి చేయి చాపమని హూంకరిస్తాడు. చేయిచాప నిరాకరిస్తూ ఆ విద్యార్థి "నేను వేరుశనక్కాయలు తినలేదు, కాగితాలు చింపిపారవేయలేదు. కనుక నేను దెబ్బలు తినవలసిన పనిలేదు." అని అంటాడు. "అయితే తిన్నదెవరో చెప్పు" అని పంతులుగారు అడుగుతాడు. "నాకు తెలియదు" అని నిర్భయంగా ఆ విద్యార్థి సమాధానం చెబుతాడు. ఆ సమాధానంతో ఉగ్రుడైన పంతులుగారు తక్షణం పాఠశాల నుండి గెంటివేస్తాడు. ఆబాలుడెవరో తెలుసా? మన కథానాయకుడు "స్వరాజ్యం నా జన్మహక్కు" అని గర్జించిన లోకమాన్య బాలగంగాధర తిలక్.

తిలక్ కాలేజీలో చదువుతున్న రోజులలో మరొక సంఘటన జరిగింది. హాస్టల్‌లోని విద్యార్థులందరూ డాబా మీద కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఈ హాస్టల్‌కు హఠాత్తుగా నిప్పంటుకుంటే మనం ఈ డాబా మీదనుంచి తప్పించుకోవడం ఎలా?" అని ఒక కుర్రవాడు సంశయాన్ని వెలిబుచ్చుతాడు. విద్యార్థులందరూ తలా ఒక ఉపాయం వివరిస్తారు. తిలక్ ఈ మాటలేమీ పట్టించుకోకుండా గబగబా లేచి "ఇదే తప్పించుకునే మార్గం" అంటూ అమాంతంగా డాబా మీదనుంచి క్రిందకు దూకేస్తాడు. తోటి విద్యార్థులు గాబరాతో తిలక్‌కు దెబ్బ తగిలిందేమోనని మెట్ల మీదనుంచి క్రిందకు దిగి వస్తుంటే తిలక్ తాపీగా, నవ్వుతూ మెట్లు ఎక్కి పైకి వస్తుంటాడు. ఈ సంఘటన ఆయన సాహసానికి ఒక మచ్చుతునక.

జాతీయ విద్యా విధానం మీద తిలక్ మహాశయునికి నిర్దుష్టమైన, స్పష్టమైన అభిప్రాయాలుండేవి. 1908 సం. లో బాలగంగాధర తిలక్ జాతీయ విద్యను గురించి చేసిన ప్రసంగమును పరిశీలిస్తే ఆ విషయం మనకు ద్యోతకమవుతుంది. "భారతీయ విద్యను నేర్పే పాఠశాలలను మనమే ఏర్పాటు చేయాలి. అయితే ఆ భారతీయ విద్యాలయాలెలా ఉండాలి? మనం అక్కడ ఏర్పాటు చేయవలసిన వాటిలో ముఖ్యాతి ముఖ్యమైనది యాముష్మికము, ధార్మికమునైన విద్య. లౌకిక (Secular) విద్య అంతఃకరణ శుద్ధిని చేయలేదు. ధర్మరూపమగు ఆముష్మిక విద్య భగవత్స్వరూపమును ప్రత్యక్షము చేయగలదు. సత్కర్మాచరణవల్ల మానవుడు భగవత్స్వరూపుడు సైతం కావచ్చునని మన మతం ఉపదేశిస్తోంది. పరమత సహనం, సద్వర్మానుష్ఠానమును బోధించే మతం ప్రపంచంలో ఒకటంటూ ఉంటే అది కేవలం మన మతం మాత్రమే. ఆ తత్వాన్నే మన మీ పాఠశాలలో బాలబాలికలకు బోధించాలి. వృథా కాలహరణం కాకుండా ఉండాలంటే దేశభాషలలోనే మన విద్యాబోధన జరగాలి. 7, 8 సంవత్సరాలలో నేర్చుకోదగిన విద్యను పరాయి భాషలో పాతికేండ్లు వచ్చే వరకు చదువుతున్నాం. పారిశ్రామిక విద్య కావాలి. వైజ్ఞానిక, యాంత్రిక నిర్మాణ విద్యలన్నీ జాతీయ విద్యాలయాలలో బోధించాలి. జాతీయ విద్యకై అవసరమైన అన్ని త్యాగాలను మనం చేయగలగాలి." విద్యా విధానం మీద ఇంకా ఎన్నో అమూల్యమైన సలహాలను తిలక్ మహాశయుడు 1908 లోనే చేసారు.

1916 లో తిలక్ షష్టిపూర్తి ఉత్సవం కడువైభవంగా జరిగింది. ఆ సందర్భమున ప్రజలు ఆయనకు లక్ష రూపాయలు సమర్పించారు. ప్రజాసేవకే అంకితమైన ఆ మహనీయుడు ఆ సొమ్మును ప్రజాసేవకే వినియోగించమని తిరిగి యిచ్చిన త్యాగశీలి తిలక్. తిలక్ ఆదర్శాన్ని ఆరాధిస్తాడు. కాని ఆదర్శవాదం పేరుతో చలామణిఅవుతూ కరుడు కట్టిన విధానాలతో తన ఆదర్శానికి కొంది కట్టించడం

ఆయన మతం కాదు. ఆయన మతం వాస్తవికమైనది. పరిస్థితులతో సమన్వయమును సాధించగలది. సంస్కార పూరితమైన ఏ విధానంతోనైనా సరే, త్వరగా - అతి త్వరగా - నిశ్చయంగా ఆదర్శాన్ని చేరడమే ఆయన మతం. కనుకనే యావన్మందిని ఆకట్టుకొని నడువ గలిగాడు ముందుకు తిలక్. తిలక్ నిష్కల్మషుడైన ఆస్తికుడు. దైవమునందు ఆయనకుగల విశ్వాసం అనంతం. అయినా మానవ ప్రయత్న ప్రాధాన్యతను ఆయన విస్మరించలేదు. ఆయన కర్మయోగి. ఉత్తమ వేదాంతి. ఆర్యుల ఆదిమ నివాసమును గురించి ఆయన చేసిన పరిశోధన ఆయనను ఉత్తమ చరిత్రకారునిగా, ఆయన రచించిన గీతా రహస్యము జీవిత రహస్యమును ఎరిగిన సత్యాన్వేషిగా ఋజువు చేసాయి. ఆదర్శ మానవ జీవితమునకు తిలక్ ఒక ఆదర్శం. ఏ రంగంలో ఉన్నా, దేశసేవ నెలా చేయాలి అనేందుకు తిలక్ జీవితం ఒక చక్కని ఉదాహరణ. తిలక్ ఒక గొప్ప వక్త. విశుద్ధమైన, రాజీ నెరుగని జాతీయవాది.

గణపతి ఉత్సవాలు, శివాజీ ఉత్సవాలద్వారా ప్రజలలో నూతన చైతన్యమును సృష్టించిన మహావీయుడు తిలక్. రాజకీయ రంగంలో నిరంతరం పోరాటం కొనసాగిస్తూ మరొకవంప చారిత్రక, ఆధ్యాత్మిక సత్యాన్వేషణలో నిరంతరం కృషి సాగించిన సవ్యసాచి మన లోకమాన్య బాలగంగాధరతిలక్ 1920 సంవత్సరం ఆగస్టు 1వ తేదిన పరమపదించినారు. ఆయన యువతరానికి యిచ్చిన స్ఫూర్తి, ధైర్యం, సాహసం ఆత్మవిశ్వాసం తిరుగులేనివి. ఆయన మన దేశ స్వాతంత్ర్యం కోసం చేసిన త్యాగం, పడిన శ్రమ మరవరానిది. అట్టి మహనీయులను నిత్యమూ స్మరించడం, వారు నడచినబాటన నడవడం మన విద్యుక్త ధర్మం. స్మరించడం కృతజ్ఞత. విస్మరించడం కృతఘ్నత. అనుసరించడం విజ్ఞత. తిరస్కరించడం అవిజ్ఞత. అట్టి మహనీయుల యెడల విజ్ఞతతో కృతజ్ఞతను ప్రదర్శించడం మన కర్తవ్యం.

## ప్రశ్నలు-సమాధానాలు

1. 'Gay' (గే) అని పిలవబడు నగరమేది ?
2. భారత జాతీయ పతాకంలోని అశోకచక్రంలో ఉన్న కమ్మల సంఖ్య ఎంత ?
3. థాయ్‌లాండ్ కరెన్సీ ఏది ?
4. మనదేశంలో అత్యధిక శాతం అక్షరాస్యత కల రాష్ట్రమేది ?
5. మెగాటన్ అంటే ఎంత ?
6. జుమ్మా మసీదు నిర్మించిన వారెవరు ?
7. అర్థశాస్త్రమును రచించిన దెవరు ?
8. ప్రపంచంలోని చక్కెర ఎగుమతుల్లో అగ్రస్థానంలో నిలచిన దేశమేది ?
9. ప్రపంచంలోకెల్లా పొడవైన గోడ ఏది ?
10. ప్రపంచంలోకెల్లా పెద్ద ద్వీపమేది ?
11. స్వదేశీ సంస్థానములను విలీనం చేసిన దెవరు ?
12. రివాల్వరును కనిపెట్టిన దెవరు ?

★★

సవరణ : జూన్ సంచికలోని 8వ ప్రశ్నకు సమాధానం 'వారన్ హేస్టింగ్స్'. గమనించ ప్రార్థన

1. పారిస్, 2. 24, 3. బాహట్, 4. కేరళ, 5. 10 లక్షల టన్నులు, 6. షా జ హా న్, 7. చాణుక్యుడు ( కౌటిల్యుడు ), 8. క్యూబా 9. గ్రేట్ వాల్ ఆఫ్ చైనా, 10. గ్రీన్‌లాండ్, 11. సర్దార్ వల్లభభాయ్ పటేలు, 12. అమెరికాకు చెందిన "కోల్ట్".

# ✶ వ్యాసపూర్ణిమ ✶

" వ్యాసాయ విష్ణు రూపాయ
వ్యాసరూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మ నిధయే
వాశిష్ఠాయ నమో నమః "

మన ఆర్ష సంస్కృతికి భారతీయ సంప్రదాయములకు సనాతన మతమునకు వేదములు మూలములు. ఆ వేదాలలోని అనంతమైన, అమూల్యమైన ధార్మిక రహస్యాలను నైతిక సూత్రాలను మనకు తెలియపరచి మనలను ఉద్ధరింపచేయుటకు ద్వాపరయుగమున భగవంతుడే సత్యవతీ పరాశరులకు స్వయంగా పుత్రుడై జన్మించెను. ఆ మహర్షియే వ్యాసభగవానుడు.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

మల్లాప్రగడ శ్రీరంగారావు

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

మన పూర్వులకు వలె మనకు ధారణాశక్తి ఉండదని తెలిసికొన్న వ్యాస మహర్షి ఒకటిగనున్న వేదరాశిని నాలుగు భాగాలుగ విభజించి పైలుడు, వైశంపాయనుడు జైమిని, సుమంతుడు అను నలుగురు శిష్యులకిచ్చి లోకమున ప్రచారము చేయించెను. ఈ నాలుగు భాగాలనే ఋగ్వేదం యజుర్వేదం సామవేదం అధర్వణ వేదం అని మనం వ్యవహరిస్తున్నాము. వేదములను యీవిధంగా విభజించినందున వేదవ్యాసుడని పేరువచ్చెను.

ఆషాఢ శుద్ధ పూర్ణిమను గురుపూర్ణిమగ వ్యాసపూర్ణిమగ భారతీయులు భావించి గురుపూజ చేయుచుందురు. ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు శ్రీ మహావిష్ణువు పాల సముద్రమున పవ్వళించి కార్తీక శుద్ధ ఏకాదశినాడు పాల సముద్రమును విడిచి వచ్చుటచే అషాఢ శుద్ధ ఏకాదశిని శయనైకాదశి - దీనినే తొలి ఏకాదశియని కార్తీక శుద్ధ ఏకాదశిని ఉత్థానైకాదశియని మనం వ్యవహరించుదుము.

క్షీరసాగరమున శయనించిన శ్రీ మహా విష్ణువు యొక్క అంశమే పరాశర మహర్షియందు ఆవిర్భవించి వ్యాసమహర్షి రూపమున ప్రత్యక్షమయ్యెను. ఆషాఢ పూర్ణిమనాడు వ్యాసమహర్షి వేదములను విభజించి కర్మ కాండ, ఉపాసనాకాండ, జ్ఞాన కాండలను లోకమునకు ప్రసాదించుటచే సర్వులకు ఆరాధ్యుడై గురువయ్యెను. అందుచే ఆషాఢ పూర్ణిమకు వ్యాసపూర్ణిమ గురుపూర్ణిమ అను నామములు ప్రసిద్ధములయ్యెను.

" నారాయణం పద్మభువం వశిష్ఠం
శక్తించ తత్పుత్ర పరాశరం చ
వ్యాసం శుకం....................
అస్మద్గురూన్ సంతత మానతోస్మి ॥

అని మన భారతీయులు చేయు గురు పరంపరా ప్రార్థనలో విష్ణువు బ్రహ్మ వశిష్ఠుడు శక్తి పరాశరుడు, వ్యాస మహర్షి, శుకయోగి వరకు పితాపుత్ర సంబంధముగ వచ్చిన గురువులను సంస్మరించుచుందుము. ఈ పరంపరలో వ్యాసమహర్షి యొక్కడే అనంత వాఙ్మయమును లోకాని కందించి గౌరవ భాజనమైన గురుస్థానము నలంకరించెను.

వ్యాస మహర్షి వేదములను విభజించుటయేగాక బ్రహ్మసూత్రములను రచించెను. ఉపనిషత్తుల సారమంతా యీ బ్రహ్మ సూత్రాలలో నిండియున్నది. వేదాంత విషయాలను సంపూర్ణంగా తెలిసికొని ఆత్మతత్వమును అనుభవంలోనికి తెచ్చుకొని ఆనందించుటకు యీ బ్రహ్మ సూత్రాలు అందరికి అధారములైనవి. జగద్గురువులు శ్రీ శంకరాచార్యులు, శ్రీరామానుజాచార్యులు శ్రీ మధ్వాచార్యులు శ్రీ వల్లభాచార్యులు మొదలగు మతాచార్యులందరు యీ బ్రహ్మ సూత్రాలకు విపులమైన వ్యాఖ్యానాలు వివరణలు వ్రాసి తమతమ మతాలను ప్రచారం చేసు

కున్నారు. అన్ని మతాల వారికి అన్ని సిద్ధాంతాల వారికి వ్యాసుని బ్రహ్మ సూత్రాలే శరణ్యములైన వన్నమాట.

అల్ప మనస్కులైన మానవులను అనుగ్రహించుటకై పద్దెనిమిది మహా పురాణాలను, పద్ధెనిమిది ఉప పురాణాలను వ్యాసమహర్షి రచించెను. వేదాలు చదివే అవకాశం లేనివారి కొరకు నాలుగు వేదాల సారంగ పంచమ వేదమన దగిన "భారతము"ను రచించి లోకానికి మహోపకార మొనర్చెను. "భగవద్గీత" యను పేరుతో మానవాళికి అవసరమైన అన్ని విషయాలను ఈ భారతము ద్వారా వ్యాసమహర్షి అందించెను. సముద్రములో మునిగిన పాత్ర తన శక్తి కొలది నీటిని గ్రహించినట్లు యీ భగవద్గీత అనే సాగరంలో మత ప్రవక్తలు మహా విద్వాంసులు తమతమ బుద్ధి వైభవానుసారము అమూల్య విషయ రత్నాలను గ్రహించి జిజ్ఞాసువులకు అందజేసారు 'ప్రస్థానత్రయ' మనే పేరుతో ఉపనిషత్తులతోపాటు బ్రహ్మ సూత్రాలు, భగవద్గీత, ప్రపంచ ప్రఖ్యాతి గాంచెను. ఆధ్యాత్మిక విషయాలలో వ్యాసమహర్షి పెట్టిన భిక్షయే సర్వులకు శరణ్యమై 'వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం' అను సూక్తిని సార్థకం చేసినది.

దయార్ద్ర హృదయుడైన వ్యాసముని కలియుగంలోని మానవుల మనోదౌర్బల్యాన్ని గుర్తించి వారి హృదయ గ్రంధులను ఛేదించుటకు భాగవత మహా పురాణమును సృష్టించి భక్తిమార్గముతో భగవదనుగ్రహము సులభముగ పొందవచ్చునని వెల్లడించెను.

'కలౌతు కేవలా భక్తిః బ్రహ్మ సాయుజ్య కారిణీ' అని వ్యాసమహర్షి కలియుగంలో మాత్రం అనన్య భక్తియే బ్రహ్మ సాయుజ్యమును కలిగించునని భాగవతమున స్పష్టంచేసి అల్పాయువులైన మానవులకు మోక్ష మార్గం చూపించెను.

ఇట్లు వైదిక వాఙ్మయమును అపారముగ సృష్టించిన వ్యాసముని ఆజన్మాంతము మనకు ఆరాధ్యులైనారు. భారతీయులందరూ ఆషాడ శుద్ధ పూర్ణిమినాడు గురు భావనతో వ్యాసమహర్షిని పూజించి స్మరించుకొందురు.

## శ్రీవాణి జీవితసభ్యులు



**శ్రీ మాజేటి కృష్ణానందరావు**

విజయవాడ

"గు శబ్ద స్త్వంధకారస్స్యాత్ రు శబ్ద స్తన్నిరోధకః
అంధకార నిరోధ త్వాత్ గురు శబ్ద రి హోచ్యతే ॥

అంధకారమనే అజ్ఞానాన్ని పోగొట్టి జ్ఞానమనే వెలుగును ప్రసాదించువాడు గురువు ఆకాశములోని సూర్యుడు కొండగుహ లోపలనున్న చీకటిని పోగొట్టలేడు. కాని గురువనే సూర్యుడు శిష్యుని హృదయ గుహలో దాగిన అజ్ఞానమనే చీకటిని నాశనం చేయగలడు. ఆకాశ భాస్కరుని కంటె గురుభాస్కరుడు మిన్న.

నేటి కాలంలో శిష్యులు జిజ్ఞాసువులు యీ పరమార్థమును గుర్తించి గురువులందు భక్తి శ్రద్ధలను పెంపొందింప చేసికొని జీవిత పరమార్థమును సాధించుకొనుటకు ప్రయత్నించవలయును.

"గురో రంఘ్రి యుగ్మే మనశ్చేన్న లగ్నం
తతః కిం। తతః కిం। తతః కిం। "

గురువుల పాద యుగమునందు మనస్సు లగ్నం కాని జీవితమునకు పరమార్థమేమున్నది ! అని జగద్గురువులు గురుభక్తిని ప్రధానముగ పేర్కొన్నారు.

గోవింద భగవత్పాద, శంకర జగద్గురువుల గురుశిష్య సంబంధము రామకృష్ణ పరమహంస, వివేకానందుల గురుశిష్య సంబంధం ఆధునిక యుగానికి నేటి యువతరానికి శ్రీరామరక్ష. ఉదంకుడు, ఏకలవ్యుడు, అర్జునుడు, కౌత్సుడు వంటి శిష్యులు తమ గురువు అనుగ్రహముచే సకలార్థ సిద్ధిని, సర్వ విద్యా రహస్యములను పొందగలిగి యుండుట మన ఆర్షవాఙ్మయమున మనము వినియుందుము.

గాంధీ శిక్షణలో నెహ్రూపండితుడు మేలిమి బంగారము వలె తేజోవంతుడై అర్థసిద్ధిని కార్యదీక్షను సాధించెను.

వ్యాసముని విశ్వ కల్యాణ కాంక్షతో ధర్మస్థాపనకై భక్త సంరక్షణకై స్వయంగా సాక్షాత్కరిస్తూ కర్తవ్యాన్ని సూచిస్తూ సందేహ నివృత్తి చేస్తూ వుంటాడు. పాండవులు లక్క యింటినుండి తప్పించుకొని ఏకచక్రపురమున వసించునపుడు వ్యాసమహర్షి ప్రత్యక్షమై ద్రౌపది పూర్వ జన్మవృత్తాంతమును తెలిపి మీ కొఱకే ఆమె యజ్ఞము నుండి ఆవిర్భవించిందని తెలియచేసెను.

కుంతీదేవి మాటపై పాండవులైదుగురు ద్రౌపదిని పరిణయమాడదలచినపుడు సందేహముతో సతమతమవుతున్న ద్రుపద మహారాజునకు ప్రత్యక్షమై ద్రౌపది పూర్వ జన్మగాథను వివరించి సంశయ నివారణ చేసెను.

వ్యాసముని త్రికాలవేది. సర్వజ్ఞుడు. అపరనారాయణుడు

"అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరో హరిః
అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః"

నాలుగు ముఖాలులేని బ్రహ్మ, రెండు చేతులుగల విష్ణువు, ఫాలనేత్రములేని శివుడు, అని వ్యాసమహర్షిని పెద్దలు స్తుతింతురు.

మానవజాతిని చీకటినుండి వెలుగులోనికి, అసత్యము నుండి సత్యములోనికి, మృత్యువు నుండి అమృతత్వము లోనికి పోవు దివ్యమార్గమును చూపించిన మహోపకారి. భారతీయులకు వ్యాసుడు హిమవత్పర్వత శిఖరము వంటి

## చెలిమి

ఎక్కడిదీ వెలుగురేఖ ?
చెలిమిలోని వెచ్చదనం
చూపిందా వెలుగురేఖ !
ఎక్కడిదీ చలువకాంతి ?
చెలిమిలోని చల్లదనం
నింపిందా చలువకాంతి !
ఎక్కడివీ తేనెల సోనలు
చెలిమిలోని తీయదనం
కురిసిందా తేనెల సోనలు !
తెల్పిందా చెలిమిలోని
నిండుదనం నీకు ?
ఏ కలిమిలోనూ
లేదుమరి ఆ గొప్పదనం !

— తమిరిశ జానకి

వాడు. ఆయన చేసిన మహోపకారమునకు ఆజన్మాంతం మనము కృతజ్ఞులమై ఆ వ్యాసుని ఆరాధించి కృతార్థుల మగుటకు దీక్షాబద్ధులం కావలసిన పర్వకాలము యీ గురుపూర్ణిమయైన ఆషాఢ పూర్ణిమయే. గురువులకు గురువు. జ్ఞాన స్వరూపుడు వ్యాసుడు. ఆ వ్యాస మహర్షి మన కందించిన వాఙ్మయము అజరామరము, సర్వ జన సమాదరణీయము. అట్టి వ్యాసమహర్షికి,

"బ్రహ్మసూత్ర కృతే తస్మై వేద వ్యాసాయ వేధసే
జ్ఞాన శక్త్యవతారాయ నమో భగవతే హరేః

అని నమస్సుమాంజలి సమర్పింతుము. 

" అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ "

తా॥ ఏ జనులు అనన్య భక్తితో అనగా ఇతర భావములు లేనివారై, నాయందే నిష్ఠగలిగియుండి, నన్నుగూర్చి చింతించుచూ ఎడతెగక, ఎల్లప్పుడూ ధ్యానించు చుందురో, అట్టివారియొక్క యోగక్షేమములను గురించి నేను బాధ్యత వహించుదును.




ఇది గీతలో చాలా ముఖ్యమైన శ్లోకము. భక్తుల బాధ్యతను మొత్తం భగవంతుడే స్వీకరించాడు. భక్తుల యోగక్షేమముల విషయంలో నాదే పూర్తి బాధ్యత అని శ్రీకృష్ణ పరమాత్మ ప్రకటించాడు. ఇటువంటి హామీ మరెవ్వరూ యివ్వలేరు. అయితే మనం మనవంతు బాధ్యతను నిర్వర్తించాలి, అర్హతను సంపాందించాలి. ఆ అర్హత ఏమిటి ? అనన్య భక్తియే అర్హత. అనన్య భక్తి అంటే ఏమిటి ? భగవంతునిమీద తప్ప మరి ఏయితర వాటి మీదకు మనస్సును పోనీయకుండా భక్తి శ్రద్ధలతో భగవంతుని ధ్యానించుట.

ప్రపంచంలో మూడు రకాల మనుష్యులున్నారు.

1. భగవంతుని గురించి ఏ మాత్రం ఆలోచించకుండా, ప్రాపంచిక దృష్టిమాత్రమే కలవారు. 2. దైవమును కొంతసేపు ధ్యానించి తరువాత ప్రాపంచిక విషయాలమీద దృష్టిని సారించువారు. 3. అసలు ప్రాపంచిక విషయాల మీదనే దృష్టిని సారించకుండా, నిరంతరం దైవధ్యానంలో నిమగ్నులై, దైవచింతనతో కాలంగడిపేవారు. ఈ మూడవ తరగతి వారినే ' అనన్య భక్తులు ' అని అంటారు. అట్టివారి యోగక్షేమముల పూర్తి బాధ్యత భగవంతుడు స్వీకరిస్తాడు.

పౌరునియొక్క Rights & Responsibilities (హక్కులు, బాధ్యతలు) మన రాజ్యాంగంలో పేర్కొనబడినాయి. అదే విధముగా భగవదానుగ్రహము పొందడానికి కూడా కొన్ని Rights & Responsibilities ఉన్నాయి. హక్కులు, బాధ్యతలు గుర్తించినవారే నిజమైన పౌరులనిపించుకుంటారు. అదే విధముగా శ్రద్ధాభక్తులు, చిత్తశుద్ధి గలవారే అనన్య భక్తులనిపించుకుంటారు. సహజంగా లోకంలో ఎక్కువమంది హక్కుల కోసం పోరాడుతుంటారేగాని బాధ్యతలను ఏమాత్రం గుర్తించరు. హక్కులు కావాలనుకునేవారు బాధ్యతలను కూడా స్వీకరించాలి. అది చేయకుండా కేవలం హక్కుల కోసం పోరాడుతూ అధికారం పొందాలనుకోవడం కేవలం స్వార్ధమే అవుతుంది. అట్టివారిని ప్రజలు గుర్తించరు, నమ్మరు. అటువంటప్పుడు అనన్యభక్తితో భగవంతుని ధ్యానించకుండా నటన చేసేవారికి భగవదనుగ్రహం ఏ విధంగా లభిస్తుంది ? శ్రద్ధ లేకుండా, చిత్తశుద్ధి లేకుండా భగవత్ కృపకు ఏ విధంగా అర్హులవుతారు ?

" Do your Duty, First. " " మొదట నీబాధ్యతను నీవుగుర్తించు." ఎట్టి స్వార్ధమైన స్వలాభాపేక్ష లేకుండా నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించు. — అప్పుడే భగవదనుగ్రహము దానంతట అదే లభిస్తుంది. అది చేయకుండా " అదికావాలి, ఇదికావాలి " అని కోరుకోవడంవలన ప్రయోజనం ఏ మాత్రం ఉండదు.

భగవానుని పూజించుట యందు, ధ్యానించుటయందు, అర్చించుటయందు భక్తి ప్రధానమైఉండాలి. అది శ్రద్ధతో కూడినదై ఉండాలి. దీనితోపాటు చిత్తశుద్ధికూడా ఉండాలి.

ఈ రెండూ మోక్షప్రాప్తికి అత్యావశ్యకములు. ముక్తికి అనన్య భక్తియే అర్హత. చిత్తశుద్ధి యోగ్యత ఈ రెండూ లేకుండా ఏవ్యక్తీ భగవత్ కృపను నోచుకోలేడు, భగవదను గ్రహమునకు పాత్రుడుకాలేడు దీనికి జాతి, కుల, మత బేధములు అడ్డురావు. ఎవరు అనన్యభక్తితో భగవంతుని పూజిస్తే వారియోగక్షేమముల బాధ్యతను భగవంతుడు స్వీకరిస్తాడు.

విదురుడు, కుచేలుడు, ద్రౌపతి అనన్య భక్తులుకాబట్టే భగవదానుగ్రహం వారికి లభించింది. గజేంద్రుడు, సాలె పురుగు, పాము నిర్మల చిత్తంతో, చిత్తశుద్ధితో భగవంతుని అర్చించారు కాబట్టే వారికి మోక్షం ప్రాపించింది హనుమంతుడు అచంచల భక్తుడు కాబట్టే శ్రీరామ చంద్రుని అనుగ్రహం లభించింది.

" యే భజన్తి తు మాం భక్త్యామయి తె తేషు చాప్యహమ్ " " ఎవరు నన్ను భక్తితో సేవింతురో వారు నాయందును, నేను వారియందును ఉందును " అని గీతాచార్యుడు స్పష్టంచేసాడు. భగవంతుడు పక్షపాత రహితుడు. ఒకరియందు ద్వేషంగాని, మరొకరియందు అనురాగం గాని ఉండదు. అందరూ ఆయన దృష్టిలో ఒక్కటే. అయితే ఆయన కోరుకునేది అనన్య భక్తికల వారిని మాత్రమే. అయితే ప్రస్తుత ప్రపంచంలో అనన్య భక్తి గలవారిసంఖ్య బహుస్వల్పంగా మాత్రమే ఉంటుంది. ఆ స్థాయికి చేరుకోవడం చాలా కష్టం. అయితే ప్రయత్నాన్ని మాత్రం విడువరాదు. కనీసం రెండవస్థానము ( అనగా దైవమును కొంతసేపు నిత్యమూ తప్పనిసరిగా ధ్యానిస్తూ, మిగిలిన సమయం ప్రాపంచిక విషయాలకు వినియోగించుట ) నయినా చేరుకోగలగాలి. దీనినిగురించి చెప్పడం తేలిక, ఆచరించడం బహుకష్టం. అయితే ప్రయత్నలోపం మాత్రం ఉండకూడదు. ఆచరించి సఫలీ కృతులైన వారికే భగవదనుగ్రహం లభిస్తుంది.

## బాల సాహిత్యారామం

# భారతీయులం

ఒకే గూటి గువ్వలం
ఒకే తీగె పువ్వులం
ఒకే తల్లి పిల్లలం
ఒకే జాతి పౌరులం
భారతీయులం ... మేము.... భారతీయులం.... ॥ఒ॥

భరతమాత మాదు కన్నతల్లి
భరత జాతి మాకు కల్పవల్లి
భరత నీతి మాదు ముక్తిగీతి
భరతవాణి మాకు దివ్యవాణి ॥ ఒ ॥

మతాలు వేరైనా మానవత్వం మరువం
కులాలు వేరైనా కుత్సితాలు ఎరుగం
రక్తమాంసము లొకటై యుండగ
వ్యక్తిగత ద్వేషాలు మాకెందుకు ?.... ॥ ఒ ॥

మమతే మాకు తొలి ముద్దు
సమతే దాని సరిహద్దు
సహనం మాకు చాలా కద్దు
కలహం మాటే రానీయొద్దు.... ॥ఒ॥

భగవద్గీతను భక్తితో చూస్తాము
బైబిలు సూక్తులు బాగుగ వింటాము
ఖురాను పఠనం ఖుషీగ చేస్తాము
మంచిని నింపి మనసును పెంచే
మతమేదైనా మాకు సమ్మతమే.... ॥ ఒ ॥

# నీలకంఠుని సమాజవిశ్లేషణ

జగద్విఖ్యాతులు, అద్వైత విద్యా దురంధరులు, అపర శంకరులు, శతాధిక గ్రంథకర్త అయిన అప్పయ్య దీక్షితుల వారి నెరుగని వారుండరు. అప్పయ్య దీక్షితుల సోదర పుత్రుడైన నీలకంఠ దీక్షితుడు కాళిదాసాదులతో సమానుడైన కవిశేఖరుడు. ఈనాడు శివలీలార్ణవము, సముద్ర మథన చంపు, సభారంజన, కలివిడంబన, అన్యాపదేశ, వైరాగ్య శతకాలను ఇంకా శివోత్కర్షమంజర్యాది గ్రంథాలను రచించిన కవి తల్లజుడు. ఈతని కవిత ద్రాక్షాపాకంలో ఉంటుంది. ఈతడు కలివిడంబన శతకంలో సంఘంలోని అన్ని రకాల మనుష్యులను సునిశితంగా విమర్శించి సత్యాన్ని ప్రకటించిన ధీశాలి. ఈతని సమాజ విశ్లేషణను పరిశీలిద్దాం.

ముందుగా మిథ్యాజ్ఞాన గర్వితులను, పండితుల్లా నటిస్తూ సభల్లో పాల్గొనే వారిని యిలా పరిహసిస్తున్నాడు.

నభేతవ్యం నబోద్ధవ్యం న శ్రావ్యం వాదినో వచః
'ఝటితి ప్రతి వక్తవ్యం సభాసు విజిగీషుభిః'

సభల్లో పాల్గొనే కొందరు తమ అజ్ఞానాన్ని గుఱించి గాని ఎదుటివారి పాండిత్యాన్ని గురించిగాని భయపడరట. ఎదుటివారు చెప్పేదాన్ని అసలు ఆలోచించరు వారి మాటలను గూడ సరిగా వినరు. అడిగిన దానికి ఏదో ఒకటి మొండిగా సమాధానం చెబుతూ, పటాటోపంతో ప్రవర్తిస్తూ, ఎదుటివారిని భయపెట్టి జయాన్ని పొందుతారని శ్లోకభావం.

శాస్త్రగ్రంథాలు చెప్పే ఉపాధ్యాయులను ఇలా పరిహసిస్తాడు.

" వాచ్యతాం సమయోఽతీతః, స్పష్టమగ్రే భవిష్యతి
ఇతి పాఠయతాం గ్రంథే, కాఠిన్యం కుత్ర వర్తతే ? "

కొందరు ఉపాధ్యాయులు పాఠాన్ని పైపైన చెప్పుకుంటూ వెళ్ళిపోతారట. శిష్యుడు పట్టుబట్టి గట్టిగా అడిగితే ప్రస్తుతం సమయం అయిపోయింది. రేపు చూద్దాంలే అంటాడు. శిష్యుడు తెలియలేదంటే 'ఈ విషయం యింతే. ముందుముందు తెలుస్తుందిలే' అంటాడు. ఇలా పాఠాల్ని చెప్పుకుంటూ వెళ్ళే వారికి ఏ గ్రంథమైనా తేలికగానే ఉంటుంది. ఏదీ కష్టం అనిపించదు.

మాంత్రికుల్ని యిలా విమర్శిస్తున్నాడు. "అవిలంబేన సంసిద్ధే, మాంత్రికైరాప్యతే యశః, విలంబే కర్మ బాహుల్యం, విఖ్యాప్యావాప్యతే ధనం " మంత్రాల వలన అన్ని ఫలాలు సమకూడుతూ ఉంటాయని వారు చెబుతూ ఉంటారు. నీకీ మంచి జరగడానికి నేనే మంత్రం వినియోగించాను అంటాడు. దైవవశాత్తు ఫలం కొద్దికాలంలో జరిగితే నా శక్తి పని చేసిందని చెప్పి కీర్తిని పొందుతాడట. ఒకవేళ అలా జరగకపోతే నీకు దుష్టకర్మలన్నీ అడ్డం గిస్తున్నాయి. వాటికి శాంతి చెయ్యాలని ధనం లాగుతాడట.

## నిష్ఠల సుబ్రహ్మణ్యం

జ్యోతిష్కులను పరిహసిస్తూ "జీవన్తో బహుమన్యన్తే మృతాః ప్రక్ష్యన్తి కం పునః " అంటాడు. ఆయుర్దాయ విషయంలో జ్యోతిష్కులు చాలా చిత్రంగా మాట్లాడుతారట. ఆయుర్బలం ఎలా ఉందని అడిగితే దీర్ఘాయుర్దాయం కలుగుతుందని ఖచ్చితంగా చెబుతారట. ప్రశ్న అడిగిన వాళ్ళు చాలాకాలం జీవించియుంటే " ఈయనే చెప్పాడు. దీర్ఘాయుర్దాయం కలిగింది " అని జ్యోతిష్కుని ప్రశంసిస్తారట. ఒకవేళ మధ్యలోనే మరణిస్తే 'అల్పాయుర్దాయం కలిగింది. దీర్ఘాయుర్దాయం అని చెప్పావు కదా' అని అడిగే అవకాశం వారికి ఉండదు! ఇలా జ్యోతిష్కులు తప్పించుకుంటూ ఉంటారట.

జ్యోతిష్కుల వలన ఫలాలు చెప్పించుకునేవారు కూడా అలాగే ఉంటారు. దైవజ్ఞుని మాట ప్రకారం నూరు రూపాయలు లాభం వస్తే ఒక తాంబూలం యిస్తారట. వెయ్యి రూపాయలు కలసి వస్తే భోజనం పెడుతారట. ఫలం జరక్కపోతే ఇక జ్యోతిష్కులకు వచ్చినన్ని నిందలు ఇంకెవరికీ రావట. లోకం కూడా అలాగే ఉంటుంది.

ఇక డాక్టర్ల విషయానికి వద్దాం.

" స్వస్థైరసాధ్య రోగైశ్చ, జంతుభిర్నాస్తి కించన
కాతరా దీర్ఘరోగాశ్చ భిషజాం భాగ్యహేతవః "

సుఖంగా ఉన్నా, తగ్గని రోగాలున్నా వారివల్ల డాక్టర్లకు ఏ లాభం ఉండదట. పిటికివాళ్ళు, దీర్ఘరోగాలున్నవాళ్ళు దొరికితే వైద్యుల పంట పండినట్లే. వాళ్ళను డాక్టర్లు ఎప్పుడూ వదలరు.

డాక్టర్ల విషయంలో రోగుల ప్రవృత్తి చిత్రంగానే ఉంటుందట. రోగం ప్రారంభమైనా మందు వాడడంలో ఉపేక్ష వహిస్తారట. అదే పోతుందిలే అని చాలాకాలం నసుగుతారు. రోగం తగ్గక బాగా ముదిరి తీవ్రస్థాయిని చేరితే అప్పుడు డాక్టరు దగ్గరికి వెళ్ళి మందు వాడడం ప్రారంభిస్తారట. రోగం తీవ్రస్థాయి నుండి దిగజారాక క్రమంగా అదే పోతుందిలే అని, ఇక తగ్గు ముఖంలోనే ఉందని మందు వాడడంలో అనాదరం ప్రదర్శిస్తారు.

ఆరోగ్య స్నానం చెయ్యగానే డాక్టరు ముఖం చూడడు. చూస్తే ఫీజు యివ్వాల్సి వస్తుంది. మందులు కూడా రాయొచ్చు. ఇదే విషయాన్ని 'స్నాతో వైద్యం నపశ్యతి' అని హేళన చేస్తాడు. ఇంకా చిత్రంగా ఏమంటాడో చూడండి –

" అనృతం చాటు వాదశ్చ ధనయోగో మహానయమ్
సత్యం వైదుష్యమిత్యేష యోగో దారిద్ర్య కారకం "

జ్యోతిష్కులు చెప్పే యోగాలు కొన్నుంటాయి. నిజమైన ధనదారిద్ర్య యోగాలవి కావు. లోకంలో అబద్ధాలు చెప్పడం, కృత్రిమ మాటలు చెప్పడమే పెద్ద ధనయోగం. సత్యం చెప్పడం, నిజమైన పాండిత్యం వలన ఎటువంటి లాభం ఉండదు. దారిద్ర్యం తీరదు. పైగా సత్యం చెప్పడం ఎవరికీ యిష్టం ఉండదు. కనుక యిదే దారిద్ర్యయోగం అంటాడు కవి.

స్తోత్రాలు చేసే కవులకు ఏ పనీ పాటా ఉండదు. పిటికివాళ్ళనైనా సరే చాలా ధైర్యశాలులని పొగడుతారు. వినయ విధేయతలు లేనివాణ్ణి ఆయినాసరే వినయవంతుడని కీర్తిస్తారు. లోభినైనా దాతగా తీర్చిదిద్దుతారు. మూర్ఖుణ్ణి బృహస్పతిగా తీర్చిదిద్దుతారు. పిడికెడు బియ్యం యిస్తారు కదా అని గుణహీనుల్లోని అవలక్షణాలను సైతం మంచి గుణాలుగా మార్చే కవులెంత హాస్యాస్పదులు.

లోకంలో కొందరు యిల్లాళ్ళు తన బంధువులు యింటికి వచ్చి వెళితే, వాళ్ళకు తిండి తినడమే చేతగాదని, తక్కువ తిండి తింటారని అంటారు. అదే భర్తృవర్గంలో వారైతే తిండిపోతులని చెబుతూ ఉంటారు. పాలు త్రాగే పాపలనైనా సరే వాళ్ళవన్నీ దొంగబుద్ధులని విమర్శిస్తూ ఉంటారు.

ఇక అప్పిచ్చే వాళ్ళను చూద్దాం. అప్పులిచ్చే వాళ్ళకు తొందరచెయ్యడమేగాని ఎదుటివారి పరిస్థితులని గమనించే శక్తి ఉండదు. అందుకే వాళ్ళను చూస్తేనే భయం కంపం కలుగుతాయి. యముడు కూడా సమయం కోసం ఎదురు చూస్తాడేగాని ఎప్పుడు పడితే అప్పుడురాడు. అప్పిచ్చిన వాడయితే ఎప్పుడైనా వస్తాడు. సమయం, సందర్భం ఉండదు.

ఇలాగే డబ్బులేని వాళ్ళకు క్రొత్తగా డబ్బువస్తే ఎలాంటి చేష్టలుంటాయో చూడండి.

" ప్రామాణ్యబుద్ధిః స్తోత్రేషు, దేవతాబుద్ధిరాత్మని
కీటబుద్ధిః మనుష్యేషు, నూతనాయాః శ్రియః ఫలమ్"

క్రొత్తగా డబ్బు వచ్చిన దగ్గరినుండి బుద్ధి అంతా మారిపోతుంది. స్తోత్రాల్లోని విషయాలు అన్నీ పరమసత్యాలని వాదిస్తారు. వాడికి కలసివచ్చింది కదా మరి. తానే దేవుడనే భావం ఉంటుంది. సామాన్యులందరూ పురుగుల్లా కనిపిస్తారు. అసలు డబ్బే మనుష్యులను ఎలా ఆడిస్తుందో చూడండి.

డబ్బే శాస్త్రాలను నేర్పిస్తుంది. తామే సరైన పండితులమని, భావిస్తారు. నిజమైన పండితులయందు చులకన భావం కలుగుతుంది. చేతిలో నాలుగు పైసలు ఆడుతూ ఉంటే యిహ వాళ్ళ చేష్టలు చూడాల్సిందే. అన్ని శాస్త్రాలను, ఆ....యివేమి శాస్త్రాలులే అని ధిక్కరిస్తారు. ఇవన్నీ స్వయంగానే వస్తాయని వాళ్ళ భావం. ఇంతెందుకు వాళ్ళ స్థితికూడా మఱచిపోతారు.

ఇక పిసినిగొట్టుల స్థితి మరీ చిత్రం. పిసినిగొట్టులకు ఎవరెన్ని చెప్పినా వాళ్ళ లక్షణమే వేరు. ధర్మశాస్త్రాలలో అనేక కర్మలు చెప్పేరు కదా. అవేవీ నచ్చవు. డబ్బు ఖర్చవుతుందని వారి భయం. ఉపవాసాలలో శుష్కోపవాసం వారికిష్టం. పైసా ఖర్చుండదు కదా. వైద్యంలో తగ్గడానికి అనేక పద్ధతులు చెప్పారు. నేరక పోయి లంఘనంగూడ మంచిదే అన్నారు. అది వీరికి బాగా నచ్చుతుంది. అన్ని యజ్ఞాలు చెప్పి జపయజ్ఞంగూడా మంచిదే అన్నారు. అడిగో, అది బాగా గుర్తుపెట్టుకున్నాడు మనవాడు. లోభుల పనులు మరీ విచిత్రంగా ఉంటాయి.

లోకంలో వేద పండితుడికి అసలు విలువేలేదు. పండితుడికి పది, కవికి ఇరవై, నాటకాల వాడికి యాభై,

( మిగతా 20 పేజీలో )

# పుస్తకసమీక్ష

సమీక్ష : డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు

పుస్తకం పేరు : **అక్షరాగ్ని**

రచయిత : **ఆచార్య తిరుమల**

వెల : పదిహేను రూపాయలు

ప్రతులకు : ఆచార్య తిరుమల, చైతన్య కళాశాల సుల్తాన్‌బజార్, హైదరాబాదు - 1

"కవుల కులాన నే నొకడ, కాకినుకాను, వసంత కోకిలన్" అని ఆత్మీయంగా పరిచయం చేసుకున్న ఆచార్య తిరుమల, "నేను పదాన్ని చీల్చుకుంటూ వచ్చే అర్థాన్ని, నేను అర్థహృదయంలో దాగిన పదాన్ని" అంటూ తనను అక్షర విజేతగాకూడా ప్రకటించుకున్నాడు. "చైతన్య రక్తాన్ని తూర్పు కన్నె పాదాలకు అరుణ సంధ్య పారాణిగా పులిమి సూర్య పద్మంగా" తన కలం ఉదయిస్తుందని కవి బాసచేస్తున్నాడు. "మనిషి మనిషికీ దూరాలు, తెగిపోతున్న శాంతి తీరాలుగా" కవి భావిస్తున్నాడు. "తేడా" అనే కవితలో "ఒకనాడు రథం ముందు జనంలా, మహానాయకుని ముందు ప్రజాశక్తి, ఈనాడు, శవం వెనుక జనంలా, మౌనరక్తి" అని వాపోతాడు. అయితే "దరిద్రంలో తడుస్తున్న ప్రజల జీవితాల్లో నవ్వు పంటలెలా పండుతాయ్" అన్న సందేహంకూడా అతనికి లేకపోలేదు. అయితే కవి ఆశావాది కావటంవల్ల, "ప్రజా సముద్రపు కోర్కెల కెరటాల మీద వచ్చి ఉద్యమాల ఓడల్లోంచి, చైతన్య శృంఖలాల్ని దిగుమతిచేసి, కాలాన్ని బంధించి, చరిత్రను లేపండి" అంటాడు. కాని "చైతన్య శృంఖల" మనే అభివ్యంజన సాంప్రదాయానికి భిన్నంగా ఉన్నది. కాలాన్ని చైతన్యంతో జయించవచ్చునన్న సందేశాన్ని కవి ఇవ్వదల్చుకున్నా, చైతన్య మెప్పుడూ స్వేచ్ఛకు దారితీస్తుంది గనుక, శృంఖలమని దాన్ని రూపకంగా చెప్పటం ఆమోదయోగ్యంగా లేదు.

సూర్యోదయాన్ని, సూర్యాస్తమయాన్ని కవి చెప్పిన తీరు హృద్యంగా ఉన్నది. "అగ్నిముఖీ! రా!" అనే కవితలో, "చీకటి నొసటను గ్రుచ్చుకొన్న సూర్య బాణాన్ని లాగి, పడమటి పొదిలో దాచుకుంటున్న ఆ వింత ప్రకృతి స్వార్థాన్ని చూడు" అంటాడు కవి. తిరిగి ఆ బాణం ప్రయోగింపబడుతుందని చెప్పటం, మరల కాబోయే సూర్యోదయాన్ని చెప్పటమేకదా! అయితే పదేపదే అదే చీకటి నొసటను సూర్యబాణం నాటవలసి ఉంటుందిగదా! అంటే చీకటికి చావులేదని కవి పరోక్షంగా అంగీకరిస్తున్నాడన్నమాట!

కవి కల్పన కొన్నిచోట్ల మనోజ్ఞంగా ఉన్నది — "తొండాల్లేని ఏనుగుల్లా కొండలు పడున్నాయి", "చచ్చిన తెల్లత్రాచుల్లాంటి వీధుల్ని నిశ్శబ్దం పీక్కుతింటోంది" — అయితే "నా కలం నుండి కవితా హారాన్ని తెంపి విసురుతున్నాను. అక్షరాల్ని అల్లరి చేయవద్దని కసురుతున్నాను" అన్నప్పుడు మాత్రం కవి కొన్నిచోట్ల తప్పటడుగులు వేశాడని అన్పించి తీరుతుంది. అక్షరమాలనే కవితాహారంగా కవి భావించాడన్నది స్పష్టమే. కానీ, "నా కలం నుండి రూపొందిన కవితాహారాన్ని" అని అనివుంటే బాగుండేది! "కలంనుండి కవితా హారాన్ని తెంపి" అనటంలో కవిత్వం దెబ్బతిన్నది. ఇక్కడ వ్యంగ్యమా, వాచ్యమా అన్న ప్రసక్తి రాదు. ఔచిత్య ప్రసక్తి మాత్రమే వస్తుంది.

రాజకీయాల్ని నాటకీయంగా కవి చెప్పిన తీరు ప్రశంసనీయంగా ఉన్నది — "తమ వారికి సర్వం త్యాగంచేసి, గద్దె లెక్కి బుద్ధులైన నా నేతల్ని చూసి, గద్దె విడిచి బుద్ధుడైనవాడు గుహల్లో గోళ్ళు గిల్లుకుంటున్నాడు." "నేతలు మారితే నుదిటి రాతలు మారతాయా!" అని కవి ప్రశ్నిస్తాడు. అదే కవితలోని చివరి పంక్తుల్ని — "నా దగ్గరేముంది బూడిద! నన్ను రాసుకున్నవాడు గాడిద —" చదివి పాఠకుడు మనసులో నవ్వుకుని తీరతాడు.

"కులమత వర్గ విద్వేషపు గోడల్ని కూల్చే చైతన్య సింధువు నా కన్నీటి బిందువు" అంటా డొకచోట కవి ! అయితే ఈ చైతన్యం సాయుధ విప్లవంతో కూడినదిగానీ, హింసను ప్రబోధించేదిగానీ కాదు. "కత్తులతో, తూటాలతో కాంతిరాదు, శాంతిరాదు" అంటాడు కవి ! "హింసలో సంస్కృతి లేదు. హింసకి నిష్కృతి లేదు" అని స్పష్టంగా చెప్తాడు. ఆయితే సమసమాజ నిర్మాణానికి పరిష్కారమేమిటి ? దీనికి మార్గం ఎవరు చూపుతారు ! దానికి కవి సమాధానం — "ఎవరి నడిగి, ఎవరి నడిగి అగ్ని ప్రజ్వలించు, అనిలము ప్రసరించు !" — "ఎవరి నడిగి, ఎవరి నడిగి జాతి సాగుతుంది ? నీతి మ్రోగుతుంది ?" — ప్రతి మనిషిలోనూ చైతన్యం తనకు తానుగా రావాలన్నది కవి సందేశం ! "విప్లవం దావానలం కాదు, జఠరాగ్ని ! జాత్యంతర చైతన్యం ! వైజ్ఞానిక పాంచజన్యం" అన్నది కవి విశ్వాసం !

ఇక భాష సంగతికి వస్తే, కవి భావనలో అభ్యుదయ పథాన నడిచినట్లు కన్పించినా, శైలిలో భావకవితా ఛాయల్లోనే ఒదిగి ఉన్నట్లు అన్పిస్తుంది. ఉదాహరణకు — "దీన జనాశ్రు తరంగిణీ తరంగాల్లో తేలి — రక్తాభిషిక్త మృత్తికా కణజాలం మీద వాలి — వివశ విరహాశ్లేష జ్యోత్స్నాభిసారికలా — అరుణీకృత నేత్రాంచల ఖండితలా —" ఇలా సాగిపోతుంది "చరమవాంఛ" అనే కవిత ! ఏ దుస్తులు ధరించినా, ఎన్ని ఆభరణాలు పెట్టుకున్నా ఆసలు కావల్సింది సిసలైన కవిత ! ఆచార్య తిరుమల నిస్సందేహంగా మంచి కవిత్వాన్నే పాఠకులకు అందించాడు. ఏదో ఒక ఉద్వేగంలో వ్రాసిన కవితను పదేపదే చదివి, మెరుగులు దిద్ది, అప్పుడు అచ్చులో తీసుకువస్తే, ఆ కొద్దిపాటి దోషాలు కూడా ఉండవు. ఆచార్య తిరుమల భవిష్యత్తులో ఈ జాగ్రత్త తప్పక వహిస్తారని విశ్వసిద్దాం !



---

## నీలకంఠ దీక్షితులు (18వ పేజీ తరువాయి)

మోసగాడికైతే యింకా ఎక్కువ యిచ్చే లోకంలో వేద పండితుడికి రూపాయి యివ్వడం కూడా అరుదే.

మోసగాళ్ళు లోకాన్ని వంచించడానికి అనేక వేషాలు వేస్తూ ఉంటారు. "ఉదర నిమిత్తం బహుకృత వేషః" అని ఆదిశంకరులు చెప్పనే చెప్పారు. కౌపీనం ధరించడం, విభూతి రాసుకోవడం, దర్భలు, రుద్రాక్షమాలలు ధరించడం, ఒకే స్థలంలో స్థిరంగా ఉండడం లాంటి లక్షణాలతో లోకాన్ని భ్రమింపజేస్తూ ఉంటారు. ఈ పై దంభాచారాలతో వంచించేవాళ్ళు చాలామందే ఉంటారు. అయితే ఈ లక్షణాలున్న ప్రతివాడూ మోసగాడే అవుతాడని యేమీలేదు. మహాత్ములూ ఉండవచ్చు.

అయితే ఈ లక్షణాలున్న కుపండితులని యిలా విమర్శిస్తున్నాడు. మంత్రాలు చదవడం తప్పు చదువుతారు. ఎందుకయ్యా తప్పు చదువుతున్నావని నిలదీసి అడిగితే "ఇదొక సంప్రదాయం" అని చకుట్కున అబద్ధం ఆడేస్తారు. మాటల్లో సంస్కారం లేకపోతే ప్రయోగంలో ఇలాంటివి చాలా ఉంటాయి ప్రయోగాల పద్ధతే వేరు. "ప్రయోగం అంటే ఏమిటి మరి ?" అని దబాయిస్తారు. అనాచారం చేస్తున్నావు కదయ్యా అని పట్టుకుంటే "దేశ ధర్మం అండీ. ఆనేక దేశాల్లో అనేక ఆచారాలుంటాయి మరి" అని చమత్కారంగా సమాధానం చెప్పి తప్పించుకుంటారు. ఇలా అబద్ధాలాడేసే వాళ్ళు లోకాన్నంతటినీ ఇట్టే జయించేస్తారు.

ఇలా లోకంలోని అన్ని వర్గాలవారి గుట్టునూ రచ్చకీడ్చి పరిహసించాడు నీలకంఠ దీక్షితుడు. "లోకంలో ఎన్ని మోసాలున్నా కాలకంఠుడిని ఆశ్రయించిన మమ్మల్ని కలికాలం ఏం చేస్తుంది ?" అంటూ ముగించాడు.

ఇలా ప్రాచీన కాలంలోనే ధైర్యంగా సమాజవిశ్లేషణ చేసిన నీలకంఠ దీక్షితకవి ధన్యుడు. ★

---

## జూన్ రంజనిమాల సమాధానములు

### అడ్డము

1. పొగ త్రాగనివాడు దున్నపోతై పుట్టున్, 4. మొగతనం, 5. వెధవ కూడా, 7. కర్పూరపు ముక్కలవలె, 10. గడగడ, 11. గడ్డి పరక, 14. చెడుతుంది, 15. పవిత్రం, 16. మొన్నటి, 19. రాయతి, 20. వొదలగొడతాను, 21. మిమ్మల్ని ముద్దు, 22. అంతా తెలుగు.

### నిలువు

1. పొమ్మనక్కర్లేదు పొగ బెడితే చాలు, 2. గట్లూ గతకలూ, 3. దురాచారము, 5. వెదవ ముండకి, 6. డామిట్ కథ అడ్డం తిరిగింది, 8. పురోహితుడు, 9. గోడ వేపు, 12. పరోపకారం, 13. అది మొగాడయినా, 17. మైలబడితే, 19. రామప్పంతులు, 20. వొద్దు వొద్దు.



మందులివ్వడం మంచిగా తియ్యగా మాట్లాడటం రాజు వంతు.

కటువుగా నిక్కచ్చిగా నయాపైసలతో లెక్కగట్టి డబ్బు పిండటం శ్యామూ వంతు.

వెళ్తున్న రోగిని చూచి రాజు మనస్సులో నవ్వుకున్నాడు.

ఈ లోకంలో నీతికి నిజాయితీకి విలువలేదు – డబ్బు ఎంతైనా ఇస్తాడట కాని ఉప్పు కారమూ మానడట. ఎలా నయమౌతుంది రోగం ?




# హ్యూమానిటీ ఫర్ సేల్

**జరిగిన కథ**

ఆమె వెతుక్కుంటూ డాక్టర్ రాజు దగ్గరికి వచ్చింది. ఆమె తన కేసంతా ఒక పేపర్ మీద రాసి డాక్టర్‌కి ఇచ్చింది. డాక్టర్ చెప్పిన 'రేటు' విని ఆమెకు కళ్ళు తిరిగినంత పనయ్యింది. ఆమె ఇస్తానన్నది వినేసరికి డాక్టర్ రాజు అక్కడ్నుంచి విసావిసా నడచుకుంటూ వెళ్ళిపోయాడు. శ్యామయ్యంగార్ ఆమెని మాటలతో రెచ్చగొట్టాడు. చివరకి ఆమెని బ్లాక్‌మెయిల్ చెయ్యటానికి ప్రయత్నించాడు. పత్రికలకి ఎక్కుతావని బెదిరించాడు. ఆమె విచిత్రంగా నవ్వి 'రేపే ఎక్కుతాను పేపర్లకి' అంటూ బయటకి నడిచింది. మర్నాడు ఆమె 'మరణ వార్త' విని కేసు పోయినందుకు బాధ పడ్డాడు డాక్టర్ రాజు. అస్త్మా పేషెంటుకు ఇష్టమయిన ఆవకాయ తినమని ఫీజు ఎక్కువ వసూలు చేశాడు డాక్టర్ రాజు. (ఇక చదవండి)

ఏ డాక్టరూ లేకుండానే ఆహార నియమాలు పాటించినట్లయితే రంగారావుకు ఇలా డాక్టర్ల గడపల వద్ద గేటు కీపరుగా కూర్చోవలసిన గతి వచ్చేది కాదు – కాని అతడెలా వింటాడు ? –

'నెక్స్ట్-' బెల్ మ్రోగించాడు రాజు – మరొకాయన వచ్చాడు – ఈయన పేరు సమ్మడు.

'ఏ వూరు మనది ?'

" ఈ పక్కనే ఇబ్రహీంపట్నం లేదు బాబూ – అక్కడే సాహెబ్ గూడా – నిన్ననే వచ్చినానండీ బానిసను. నీ కాళ్ళకు మొక్కుతా – ఎందుకో ఒకటే తల తిరుగుడు – కళ్ళు మంట – కాళ్ళు గుంజడం – ఆకలి కాదు – "

" నీకేమన్నా దురభ్యాసాలున్నాయా "

" అయ్యా బాబు - "

" చుట్ట బీడి తాగుడూ "

" ఏదోనండీ "

పొగాకు విషంవల్ల ఇతని జీర్ణకోశం దెబ్బతింటున్నది- "లివోమిన్" అని ఓ టానిక్ వ్రాశాడు — ఇదుగో ఇది రోజూ రెండు పూటలా నీళ్ళల్లో కలిపి ఓ పదిహేనురోజులు తీసుకో, తర్వాత కన్పడు - "

" అయ్యా ! కళ్ళమంట కాళ్ల గుంజడం "

" అన్నీ తగ్గుతాయి "

" బానిసను దొరా నీ కాళ్ళకు మొక్కుతా. బాగా చూస్తారంటే దూరంనుంచి వచ్చొచ్చినా — ఒక్కొక్క జబ్బే చూచి అన్నిటికీ మందులు రాసి ఇవ్వండి" సమ్మడి ప్రార్థన.

లివోమిన్‌తో అన్నీ తగ్గుతాయంటే ఇతనికి సంతృప్తి లేదు - విడివిడిగా ఓ ఇరవై ముప్పై టానిక్స్ ఇంజెక్షన్సు కాప్సిల్స్, పిల్స్ అన్నీ వ్రాసి ఇవ్వాలి - అన్నీ వాడు భూములు తాకట్టు పెట్టి సొమ్ము తెచ్చి కొనుక్కోవాలి. అప్పటికిగాని సంతృప్తిలేదు.

రాజు వరుసగా ఓ పెద్ద మందుల కేటలాగు తయారు చేసి ఆ వచ్చిన పేషెంటు కిచ్చాడు.

" నీ కాళ్ళకుమొక్కుతా - సూదులు ఏయించండి - లేకుంటే మా గూడెం వాళ్ళంతా నవ్వుతారు - బనాయిస్తరు - పట్నంపోయి సూదులు లేకుండా వాస్తే ఒకటే పరేశాన్."

రాజు వాడికి వరుసగా మూడు ఇంజెక్షన్లు ఇచ్చాడు.

పేషెంటు ముఖంలో చిరునవ్వులు పూశాయి.

"అటుపోయి మా కాంపౌండర్ వద్ద సీసాలో మందు ఒకటి తీసుకో ".

" దొరా - నా అరికాళ్ళల్లో ఏదో గుచ్చుకున్నట్లుంటుంది ".

" నీదేం పని ? "

" పొలం కూలీని "

పొలంలో పనిచేసే వాడికి కాలిలో ముళ్లూ, గడ్డలూ గుచ్చుకొంటాయి. ఆ గుచ్చుకోవడం ఒక రోగ లక్షణమని పిడి భావన. దానికి రాజు మందులు రాసి ఇవ్వాలి. దానితో మందుల కంపెనీ వాళ్ళు బతకాలి - ఏజెంట్లు బతకాలి వైద్యులు బతకాలి.

రాజు కడుపులోకి ఓ మందూ, కాళ్ళకు పై పూతకు ఓ రెండు మందులూ వ్రాసి ఇచ్చాడు.

" దొరా - నాకెందుకో గోళ్ళు గుచ్చుకుంటాయి - ఏం చేయను "

గోళ్ళు గుచ్చుకుంటే మంగలి దగ్గరికిపోతే పరిష్కార మార్గం దొరుకుతుంది. కాని సమ్మడికి వైద్యుడే అందుకూ మందు ఇవ్వాలి. డాక్టరు రాజు బుద్ధిమంతుడు. గోళ్ళు గుచ్చుకుంటున్నందుకూ మందులు రాసి ఇచ్చాడు. అయితే రాజు సామాన్యుడు కాడు. గోళ్ళంటే అన్ని గోళ్ళూ ఒకటే కాదు. కాలి గోళ్ళు వేరు - చేతుల గోళ్ళు వేరు - అందులోనూ కుడికాలివి వేరు - ఎడమ చేతివి వేరు - అందుకని వేరువేరు మందులు రాసి ఇచ్చాడు.

" ఇవన్నీ కొనితెచ్చుకో, వాడుకో — తగ్గకపోతే వారం పోయినాక మళ్ళీరా - మళ్ళీ రాసిస్తాను ".

" బానిసను దొరా - అప్పుడూ తగ్గకపోతే మళ్ళీ వస్తాను. "

" నీవెన్నిసార్లు వస్తే అన్నిసార్లూ రాసి ఇస్తాను - జీవితాంతం రాసిస్తూనే వుంటాను ".

" చల్లంగా నూరుకాలాలు బతకాలి దొరా - అందుకే అంతా చెప్పారు తమ దగ్గరికొస్తే మంచిగా చూసి, మందులూ బిళ్ళలూ సూదులు అన్నీ ఇస్తారని ".

ఎన్ని ఎక్కువ మందులు రాసిస్తే అంత గొప్ప డాక్టరు సమ్మడి దృష్టిలో - వాళ్ళ సాహెబ్ గూడా వాళ్ళ దృష్టిలో.

ఓ లెటర్‌పాడ్ మొత్తమూ సమ్మడి మందులకే అయిపోయింది. ఈ కట్ట మొత్తమూ చేతబట్టుకొని తృప్తిగా శ్యామూ దగ్గరికి నడిచాడు సమ్మడు.

" నెక్ట్స్ " – బెల్ మ్రోగించాడు.

ఎవరూ రాలేదు.

" నెక్ట్స్ ప్లీజ్ "

" నెక్ట్స్ నేను ప్లీజ్ " లేడీలా దిగుతూ వచ్చింది రాణి.

రాణి పంజాబీ డ్రెస్ వేసుకుంటే డాక్టర్ రాజుకు ఎంతో ఆనందం. కుమార్తెను ఎంతో గర్వంగా అలా చూస్తూ ఉండిపోతాడు.

" అయ్యా డాక్టరుగారూ నాకు కొంత డబ్బు కావాలి సార్ ".

" అలాగే ఏదీ పరీక్ష చేయనియ్యి "

" పరధ్యానం ప్రొఫెసర్‌గారూ – జబ్బు కాదు – డబ్బు కావాలి నాకు. "

" అలాగే తీసుకుపోమ్మా " ఆత్మీయత రెండు కళ్ళల్లోనుండి పొంగుతూ వుండగా అన్నాడు.

క్యాష్‌బాక్స్ వద్దకుపోయి తీసుకుంది వందరూపాయలు. శ్యాంఅయ్యంగార్ కొంచెం ఆగి అన్నాడు 'ఈ డబ్బును ఏ ఖర్చు కింద జమ కట్టమంటారు. "

రాణి నవ్వింది. ఆ నవ్వుల వెన్నెలలతో రాజు పాల రాతి భవనపు గోడలు ముత్యాలనీడలను ప్రతిబింబించాయి.

"నీ ఇష్టం వచ్చిన ఎకౌంట్ రాసుకోవయ్యా పుల్లయ్యా. ఎందులో రాస్తే నాకేం – నా విలాసపు యాత్ర – పిక్‌నిక్‌కని వ్రాయి – లేదా సాదరు ఖర్చు క్రింద లెక్క వ్రాయి ".

శ్యాం ఒక్కక్షణం ఆగి అన్నాడు " సాదరు ఖర్చు కింద వంద రూపాయలు. "

రాణి మరో చిరునవ్వుతోనే సమాధానం ఇచ్చింది. కొరడాతో ఛెళ్ళున కొట్టినట్లుందా చిరునవ్వు. అడిగే అధికారం నీకు లేదనట్లు అపహాస్యం చేస్తున్నదా చిరునవ్వు.

" డాడీ టాటా " తూనీగలా దూసుకుంటూపోయింది రాణి.

శ్యాం అయ్యంగార్ అన్నాడు " సార్ – అమ్మాయి గారికి మంచి సంబంధం చూడాలి తమరు " పుస్తకంలోని అమ్మాయిగారి ఎకౌంట్ చూస్తూ.

డాక్టరు రాజు నవ్వాడు సాలోచనగా, ఎదురుగావున్న కోదండపాణి సీతా సమేతంగావున్న క్యాలెండర్ చూస్తూ.

" మే ఐ కమిన్ సర్ "

" యస్ కమిన్ " మామూలు మూడ్‌లోకి వచ్చాడు రాజు. లోనికి ఓ వ్యక్తి చేతి సంచీతో ప్రవేశించాడు.

" కూర్చోండి. మీ రోగ లక్షణాలు వివరించండి "

" క్షమించండి సార్ – నాకే రోగమూలేదు - రోగం నన్ను చూచి నూరామడలు పారిపోతుంది. "

" మీ పేరు "

" అప్పళాచారి "

" ఏం పనిమీద వచ్చారు ? "

" ఇక్కడ బరకత్‌పురా రామమందిర నిర్మాణానికి చందా వసూలు చేస్తూ వచ్చాను అయ్యా – అందరూ అన్నారు ఇలాంటి మహాకార్యాలకు చిన్న చిన్న బావుల దగ్గరకుపోతే లాభం ఏమిటి ! దయాసముద్రుడు రాజుగారినే ఆశ్రయించమని – అందుకని తమరిని మహారాజపోషకుల జాబితాలో వేశాను. "

రాజు నవ్వాడు " అప్పళాచారిగారు – దప్పికైతే నల్లా (పంపు) దగ్గరికి పోవడమే మంచిది. సముద్రపు నీళ్ళు ఉప్పగా వుంటాయి తాగడానికి పనికిరావు. శ్యామూ వీరికొక ఐదు రూపాయలు ఇచ్చి పంపు. "

" అమ్మమ్మా – అంతమాట అనకండి. మీరు మహారాజ పోషకులే – వెయ్యినూట పదహార్లవారే " అప్పళాచారి ఉడుములాగా పట్టుపట్టాడు.

రాజు అప్పళాచారి మీద ఒక అస్త్రం ప్రయోగించాడు.

" ఇలా రావయ్యా - ఏదీ నాలుక జాపు "

అప్పళాచారి అయోమయంగా నాలుక జాపాడు.

" ఏదీ కళ్ళు – ఆఁ – ఇలా " కళ్ళు పరీక్షించాడు రాజు.

ఏదో నిర్ణయానికి వచ్చినట్లు బుర్ర ఆడించాడు.

" ఏమిటి బాబూ – ఏమయింది ? " అప్పళాచారి అనుమానంగా అడిగాడు.

" నీవు ముఖం ఏమిపెట్టి తోముతుంటావయ్యా "

" హాయిగా వేపపుల్ల కోసుకోని మంచిగా కుంచెలాగా చేసుకొని ధగధగ మెరిసేటట్లు తోముకుంటాను. మనకీ బ్రషులూ బుషులూ పడవు. "

" ఫ్రూట్ జూస్ తీసుకుంటున్నావా ? "

" లేదండీ – నేను ఎన్నడూ పండ్లు తినందే. పండ్లల్లో ఏముందండీ. ఒట్టి చెత్త – ఉన్నదంతా ఆ తొక్కలలోనే వుంది పండ్లు పిల్లలకు పెట్టి నేను తొక్కలు తింటాను. "

" ఇంకా ".

" ఇంకా దేవుడు చాలా మేలు చేస్తే – ఆఁ తవుడు తింటాను సార్ – తవుడు – ఈ యంత్ర నాగరికత ఫలితంగా మన సంస్కృతీ, ఆహార వ్యవహారాలు అన్నీ సమూలంగా పతనమైనాయి. జీవసారమైన తవుడు జంతువులకు పారేసి ఒట్టి చెత్త బియ్యం తింటున్నాము. జబ్బులు తెచ్చుకుంటున్నాము. డాక్టరు బిల్లులు ఆర్థిక దుస్థితి ఫలితంగా జీవితం పైన విరక్తి – ఈ విషవలయంనుండి తప్పించుకోవాలంటే మనుషులంతా అన్నం తినడంమాని తవుడే తినాలని నా సిద్ధాంతం ".

" నీ సిద్ధాంతాలకేమిగాని ఆ ఆదర్శమే కొంప ముంచింది అప్పళాచారీ. "

" అంటే...."

" అంటే నీ కొక విధమైన ఉదరవ్యాధి ప్రారంభమైంది. దాని లక్షణాలు కళ్ళల్లోనూ నాలుక మీదా స్పష్టంగా కన్పిస్తున్నాయి అందుకే అడిగాను. "

అప్పళాచారికి పిడుగు పడ్డట్లయింది.

" నాకేమిటీ – జబ్బులేమిటీ – ఎవడైనా నవ్వుతాడు సార్ ".

" ఆఁ కేసు ఇలా నిర్లక్ష్యం చేస్తే నువ్వు నిజంగానే అపహాస్యం పాలవుతావు ".

" అదేమిటీ – అంత వ్యాయామం చేస్తాను, చెప్పులు లేకుండా చార్మినార్ నుండి బొలారం దాకా ఏకబిగిని నడుస్తాను. రెండు పూట్లా రెండు శేర్ల బియ్యం ఇరవై చపాతీలు టకటక లాడించి అరిగించుకుంటాను. నాకు జబ్బేమిటీ ".

" అవన్నీ రోగలక్షణాలేనయ్యా పంతులూ. విపరీతంగా నడవాలనే కోరిక – విపరీతమైన ఆకలి – తిన్నదంతా క్షణాలమీద అరిగిపోవడం మళ్ళీ ఆకలి – ఇదంతా ఒక విధమైన జబ్బు. "

" దాని పేరు ".

" పేరు నీకెందుకు ? నీవేం వైద్యుడివా. మందుల పేర్లూ రోగాల పేర్లూ చేంతాడులా బారల పొడుగున ఉంటాయి అల్లోపతీలో – రోగలక్షణాలైతే వున్నాయి – ఇంకేమి ? "

" నాకు జబ్బు, నాకు జబ్బు ".... అప్పళాచారి కళ్ళు అయోమయంగా చక్రాలు తిరిగాయి. అతని మనస్సులో రోగబీజాలు నాటుకున్నాయి.

" నాకు రోగమేమిటీ...." అప్పళాచారి పలవరింత.

"ఇదుగో అప్పళాచారి నీకు రాత్రిళ్ళు కలలొచ్చాయా లేదా. "

" ఆఁ వచ్చాయి ".

" ఏవేం కలలు - రాత్రి వచ్చిన కల ఏమిటీ ? "

" ఏదో రామమందిరం కట్టించినట్లూ – అంజనేయుల వారు సముద్ర లంఘనం చేసినట్లూ రాక్షసులంతా పారిపోతున్నట్లూ "

" ఇంకేం మరి. అదంతా రోగలక్షణమే. యాబ్సింతియం అని ఒక మందుంది హోమియోలో. అది ఇలాంటి రోగానికి ప్రథమ దశలో వాడుతారు. నీ మాటలు నీకే వినపడ్డట్లు ఉంటుంది. అప్పుడప్పుడు రామచంద్రులవారు నీ మీదికి పూనినట్లుంటుంది. ఒళ్ళు తెలియనట్లు అనిపిస్తుంది. రాక్షసులంతా కళ్ళల్లో కలల్లో పరుగెత్తుతూ వుంటారు. "

" అప్పనంబీ – అవన్నీ నాకున్నవే – నా లక్షణాలే. కాని అదంతా భక్తి భావనా రహస్యం కదా. "

" భక్తి కాదు అప్పళాచారి – ఇదంతా రోగశక్తి భావనా రహస్యం . మాట్లాడకుండా ఓ ఆయిదువందలు పట్రా – కేసు ఇప్పటికే కుదిరిపోయింది. "

అప్పళాచారి గజగజ వణుకుతున్నాడు. అతని ముఖం పాలిపోయింది. కళ్లు శూన్యాన్ని చూస్తున్నాయి. నాడి అందడంలేదు.

" అరెరె ఇది రోగలక్షణమే – ఏదైనా సంతోష విషాద వార్తలు హఠాత్తుగా విన్నప్పుడు మనిషి బంగరాలు చుట్టుకొనిపోవడం – ఫిట్స్ వచ్చినట్లు బిగుసుకుపోవడం – శ్యామూ – శ్యామూ – ఇంజెక్షన్. "

" ఏ ఇంజెక్షన్ సార్ – ఎఫ్ వన్ ఆర్ ఎఫ్ టూ."

" ఎఫ్ టూ తీసుకురా. "

రాజు అప్పళాచారికి ఇంజెక్షనిచ్చాడు. " లేవయ్యా లే – ప్రథమ చికిత్స జరిగింది. ఇంక భయం లేదులే – నేను అభయం ఇస్తున్నాను లేచి కూర్చో. "

అప్పళాచారి లేచి కూర్చున్నాడు. గుండ్రాయిలాంటి అప్పళాచారి, ప్రకృతి చికిత్స యోగాసనాల స్పెషలిస్టు అప్పళాచారి, అన్నం మాని తపుడూ పండ్లు మాని తొక్కలూ తిని విటమిన్లతో కండలు పెంచిన భక్త శేఖరుడు అప్పళాచారి, ఏనుగలా దవాఖానాలోకి ప్రవేశించిన అప్పళాచారి క్షణంలో పీనుగులా మారిపోయాడు.

వెర్రి చూపులతో తడి ఆరిపోతున్న నాలుకతో డాక్టరు రాజును భయం భయంగా చూస్తున్నాడు.

" అప్పళాచారి – నోరు తడి ఆరిపోతున్నట్లు అనిపిస్తున్నదా ".

" అవు – నం – బీ. "

" శ్యామూ కేసు కొంచెం సీరియస్‌గా వుంది – ఎఫ్ – త్రీ తీసుకురా. "

మళ్ళీ మరొక ఇంజెక్షన్.

అప్పళాచారి వణుకుతున్నాడు.

" భయపడకు ఆచారి – ముందొక వంద రూపాయి లివ్వు చాలు " – దేవుడికై వసూలు చేసిన చందా సంచినుండీ వంద రూపాయల నోటు తీసి ఇచ్చాడు అప్పళాచారి.

" శ్యామూ ఈయనకు ఇంజెక్షన్లు రాసిస్తున్నాను – రేపటినుంచీ నేనున్నా లేకున్నా వేళ తప్పకుండా వరుసగా ఓ నెల వాడు. "

" సరే – సార్ ".

" అప్పళాచారి నీవింక నిర్భయంగా వెళ్ళు – నీ జబ్బు నయమైనట్లే భావించు. "

అప్పళాచారి అయోమయంగా వెళ్ళాడు.

" రేపటినుంచీ ఈయనకు ఏ ఇంజెక్షన్లు ఇవ్వను సార్ " శ్యాం నవ్వుతూ అడిగాడు.

"అదే ఎఫ్ త్రీ – ఎఫ్ ఫోర్ – ఎఫ్ ఫైవ్ – అలాగా ఎఫ్ ఫిఫ్టీ వరకు. "

ఎఫ్ – అసత్యానికి ఒక సంకేతం. కేవలం నీళ్ళ ఇంజెక్షన్లు. డిస్టిల్డ్ వాటర్‌తో సూదులివ్వడానికి రహస్య పరిభాష. రాజూ శ్యాములకు మాత్రమే అర్థమయ్యే వ్యాపార రహస్యం.

" సార్, అప్పళాచారి టేబిల్‌మీద చందా రశీదు పుస్తకం మరచిపోయాడు కంగారులో. "

రాజు నవ్వుతూ పుస్తకాన్ని చూచాడు. " డాక్టర్ మకరంద్ - 1116=00 " అని వుంది మొదటి కాగితం మీద.

" శ్యామూ. "

" సార్. "

" ఎవడీ మకరంద్ ".

" అతనే సార్. ఆ కొత్త డాక్టర్ మొన్ననే చమన్ దగ్గర దవాఖానా తెరిచాడు. "

" చూడు – ఇతను నిర్లక్ష్యంగా ఓ మామూలు చందా వెయ్యి నూటపదహార్లు వేశాడు – శ్యామూ – ఈ మకరంద్ మీద ఓ కన్ను వేసి వుంచు. "

" అలాగే సార్. " (సశేషం)

# ఆరోగ్యానికి అరటిపండు

"పండ్లు పండలు విటమిన్ టాబ్లెట్లు, సీసాలు సీసాలు టానిక్కులు బదులుగా ప్రతిరోజూ రెండు అరటి పండ్లు తీసికోండి. చాలు ఇక మీ జీవితానికి ఏ ఢోకా రాదు." ఇవి నేను రాస్తున్న మాటలు కాదు, ఆరోగ్యంతో వుండే ప్రతి మనిషి చెప్పే ఆరోగ్య రహస్యం.

అందరికీ అన్ని రకాలుగా ముఖ్యంగా ధరలో అందుబాటులో వుండి, అన్ని కాలాలలోను విరివిగా లభిస్తూ చిన్న పిల్లల దగ్గర్నుంచి పళ్ళూడిపోయిన ముసలివారి వరకు ఎంతో ప్రీతిగా భావించబడుతుంది. అరబ్ మరి కొన్ని ఇతర దేశాలలో దీనిని "స్వర్గపు ఆపిల్" అని కూడ పిలుస్తుంటారు.




అరటి రెండు రకాలు. ఒకటి తినే అరటి, రెండవది కూర అరటి.

తినే అరటి చెట్టుమీదే పళ్ళుగా మారిన తరువాత తింటే ఎంతో రుచిమయంగా వుంటాయి. కూర అరటికాయ మాత్రం పచ్చిగా వున్నప్పుడే ఉపయోగిస్తారు. ఇది పండినా రుచిగా వుండదు.

**అరటి జాతులు :** తెల్ల చక్రకేళి, ఎర్ర చక్రకేళి, అమృతపాణి, కర్పూర చక్రకేళి, వామన చక్రకేళి, పచ్చరటి, కొమ్మరటి మొదలగు తినే అరటిపండ్లు.

బొంతరటి, కొండరటి మొ॥నవి కూర అరటికాయలు.

తెల్ల చక్రకేళి, ఎర్ర చక్రకేళి మిగలపండితే వాటి రుచి అమోఘంగా వుంటుంది. కర్పూర చక్రకేళి సువాసనలు వెదజల్లుతూ వుంటుంది. ఈ చక్రకేళీ జాతులు పరిమాణంలో పెద్దవిగా వుండి, తోలు ఒకమాదిరి మందంగా వుండి ఆకుపచ్చ రంగులో వుంటుంది. పండు మిగల పండితే తోలు పలుచగామారి, పైన బూడిదరంగు మచ్చలు వ్యాపిస్తాయి. పచ్చరటి మాత్రం ఒకమాదిరి పరిమాణంలో వుండి, రుచి కలిగివుంటాయి.

**పోషకవిలువలు :** పండిన అరటిపండులో సగటున 1.3 శాతము మాంసపుకృత్తులు, 0.2 శాతము క్రొవ్వు, 0.1 శాతము లోహ కణాలు, 36.4 శాతము పిండి పదార్థము, 0.01 కాల్సియము, 0.05 ఫాస్ఫరస్, 0.4 Mg. శాతము ఇనుము వున్నవి. దీనిలో 'సి' విటమిన్ అధికంగా వుండటమే కాకుండా తయామీను, రిబాప్లావిను, కొద్దిగా నియాసిన్ రసాయనాలు కలవు. ఇక లోహాలు 100 గ్రాములకు, సోడియం 12, పొటాసియమ్ 3.48, మెగ్నీషియమ్ 4.10, రాగి 0.16, గంధకము 13.0, క్లోరిన్ 78.5 మి.గ్రా. వుంటాయి.

పిండిపదార్థాల శాతము గూడా అధికంగానే వుంటుంది. ఇందులో ముఖ్యంగా గ్లూకోజ్ ఎక్కువ శాతంలో వుంటుంది. ఇది దాదాపు 53.82 శాతము వరకు వుంటుంది. ఇంకా ఫలశర్కర 3.75 శాతము చెరకు చెక్కర 6.58 శాతము వుంటాయి.

100 గ్రాముల క్లోరిఫిల్ విలువ 15.3. ఈ విలువ మిగతా పళ్ళన్నింటికంటే ఎక్కువ.

**ఔషధ తత్వము :** దీనిలో ఎటువంటి మంట, ఉద్రేకము కల్గించు పదార్థము లేనందున దీనిని ప్రేగులలో పుండు వచ్చే అవకాశాలను నిరోధించును. ఒకవేళ పుండు వున్నవారికి ఇది ఇబ్బంది లేని సాఫీ ఆహారముగా వుపయోగించును. అరటిపండు, చింతపండు, ఉప్పు కలిపి తీసికొనిన జిగట రక్త విరేచనములకు నివారణగా

పనిచేయును. చిన్న పిల్లల జిగట విరేచనములకు గూడా అరటిపండు గుజ్జు మెత్తగా చేసి ఇచ్చిన మంచి గుణము చూపును. నీటి విరేచనములు కలవారికి పచ్చరటి ఎన్నో రకాలుగా ఉపయోగపడును. పండిన పళ్ళు మలబద్ధకము కలవారికి సహాయపడును. మధుమేహము కలవారు కూడా అరటి ఫలమును వాడవచ్చును. దీనివలన మూత్ర శర్కర మెరుగైనట్లు గమనించబడింది.

మేహశాంతి, పైత్యశాంతి, వీర్యపుష్టి, బలమునకు ఇది ఎంతో తోడ్పడును. అంతేగాక మంచి రక్తము ఉత్పత్తికి దోహదము చేసి గుండెను, పొట్టను మృదువు పరచును. కాకను, పొడి దగ్గును, ఆకలి దప్పులను అణుచును. గొంతుకను శుభ్రపరచుటయు, మూత్రపిండములకు మంచి సత్తువను కలిగించును.

కాని, వాతశ్లేష్మశీత్వము, నేత్ర రోగములు, హెర్నియా గలవారు మాత్రం దీనిని ఉపయోగించరాదు. పరగడుపునే అరటిపండు తిని, నీరు త్రాగుటవలన గ్రహణీ వ్యాధి వచ్చును.

అరటిపండు ఎదిగే పిల్లలకు మంచి ఆహారము. దీనిని పాలతో కలిపి ప్రతిరోజూ ఇవ్వవచ్చును. దీనితో తయారుచేయు జామ్‌లు, షర్బత్తులు, పిండి ఎంతో బలవర్ధకమై, మంచి రుచిగా వుండి ఆనందమును కల్గించును.

అరటిపండ్లు అరబ్ దేశాలకి ఎగుమతి చేయుటకు, ఒక ప్రత్యేక విమానమును నడుపుచున్నారు. దీనిని బట్టి అరటిపండు మీద ప్రపంచదేశాల మక్కువ వెల్లడగుచున్నది.

— వంకాయలపాటి చంద్రశేఖర్

# ధృతరాష్ట్రుడు పురజనుల అనుమతి కోరడం

ధృతరాష్ట్రుడు వనవాసానికి బయలుదేరడానికి వ్యాసుడూ, ధర్మరాజూ అనుమతించినా అతనిలోని సంస్కారం, ఔచిత్యభావం మేల్కొని, తాను పురజనుల అనుమతిని కూడా అర్థించవలసి ఉన్నదనుకొన్నాడు. వాళ్ళతో తనకు ఎంతో అనుబంధమున్నది. మంచి రోజుల్లోనూ, చెడ్డ రోజుల్లోనూ వాళ్ళందరూ తనవొక కంట కనిపెట్టి చూసుకొని వుండేవారు. తానూ వాళ్ళను అలానే చూచేవాడు. ఈ అనుబంధం త్రెంచుకోవడం కష్టమైనా, తప్పనిసరి అయినదే. కాగా వాళ్ళ అనుమతి నర్థించడం తన కనీస ధర్మమనుకున్నాడు వృద్ధరాజు.

వడలి మందేశ్వరరావు

ధృతరాష్ట్రుని కోర్కెననుసరించి ధర్మరాజు పురజనులనందరను పిలువనంపాడు. కరిపురమంతా కదిలివచ్చింది. ధృతరాష్ట్రుని బంధుమిత్రులందరూ వచ్చారు; పాండవులూ అక్కడే ఉన్నారు. అందరూ ధృతరాష్ట్రి మందిర ద్వార పురోభాగమున వృద్ధరాజు కోసం ఎదురు చూస్తూ నిలబడ్డారు. అప్పుడు అంబికేయుడు గాంధారి తోడురాగా వెతలి వచ్చాడు. " బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర సంకులంబైన యన్నగర ప్రజనుద్దేశించి " వారల దగ్గర సెలవు తీసుకొంటూ, వనవాసానికి వారి అనుమతి నర్థిస్తూ అతడు ఎంతో ఆత్మీయంగా, సాహిత్యంలో మకుటాయమానంగా ఉండే ప్రసంగాన్ని చేసాడు.

" కౌరవ కోటియు - మీరుఁ బెద్దయుఁ గాల,
మనఁగి పెనంగియ - న్యోన్య సంభృ
తాధిక స్నేహుల - కై ప్రవర్తించితి, రనఘ
వర్తనులార - వినుఁడు నాదు
పలుకు వృద్ధునకుఁ ద - పశ్చరణంబున, కై
వనంబున కేఁగు - టర్హ కర్మ
ముచిత కృత్యంబుల - యోజ మీరెఱింగిన,
యదియ నా మది ముదమార మీర
నెల్ల నా కనుజ్ఞ - యిచ్చి కానకుఁ బుచ్చుఁడు ! "
ఆశ్రమ : 1-85

అనేటప్పటికి సర్వజనులకు కళ్ళు చెమ్మగిల్లాయి. దృష్టి మందగించింది. ఎంత దిగమ్రింగుదామనుకున్నా, దాగకుండా వాళ్ళు " గద్గదిక నెలుంగెడలఁగ, నార్తి దోఁప నేడ్చిరి ! "

ధృతరాష్ట్రునికి వాళ్ళు కంటతడి పెట్టుకోవడం కనపడలేదు. కాని, వారి ఏడ్పు వినబడింది. తానే స్థిరుడై, ధైర్యాన్ని వీడక వెనుకటి రోజులను వాళ్ళకు జ్ఞప్తికి తెచ్చాడు. శంతనుడీ భూమిని ప్రజలు ఎంతో ముదమొందేటట్టు పాలించాడు; ఆమీద విచిత్రవీర్యుడు ఈ రాజ్యాన్ని సురక్షితంగా ఏలాడు; తర్వాత " పాండురాజు పాలనలో మీరెంతగానో హర్షాన్ని పొందారు. అతని కొడుకు సత్యధర్మాత్ముడు. ఈతణ్ణి అనుసరించక దుర్యోధనుడు అన్యాయం చేసి దుర్ణయమున రాజ్యాన్ని ఏలి, లోకానికి ఘోరమైన విపత్తును తెచ్చిపెట్టాడు. క్షత్రియ కులం అంతా ఇంచుమించు తుడుచుకొనిపోయేటట్టు చేసాడు. వాని దుశ్చేష్టలకు మూలం నేనే ! అయినా మీరు దీనిని మనసున పెట్టకండి. ఈ భూమిని చక్కగా పాలించిన ఒక రాజుకు ఈతడు అన్న; మరొక రాజుకు కొడుకు, ఇంకొక రాజుకు మనుమడు ! అని కనికరించి నాకు వనవాసానికి అనుజ్ఞ నివ్వమని కోరుతున్నాను. "

ధృతరాష్ట్రుని ఈ మాటలు పెదవి నుంచి వచ్చినవి కావు, ఎక్కడో గుండెల్లో గూడుకట్టుకొని వున్న పశ్చా

త్తాప భావంతో పైకి వచ్చినవే ! అతని లోభం లోభమే, పుత్ర ప్రేమవల్ల కలిగిన మోహము మోహమే ! అయినా సంజయ విదురుల నీతులు బొత్తిగా చవిటినేల విత్తినట్లవ లేదు. అందుకే ఆ పౌరుల మనసున లేకపోయినా, తన కీళ్ళను ఉగ్గడించాడు. ప్రజలంతా మౌన్పడి వింటున్నారు.

"నన్ను కాకపోయినా, వృద్ధ, కృపణ, పుత్ర విరహిత యీ గాంధారిని చూచిఅయినా నాకు వనవాసానికేగడానికి అనుమతి నీయండి. ఇటు ఈ ధర్మరాజును చూడండి. తమ్ముల మధ్య ఈతడు దిక్పాలకుల మధ్య మఘవునిలా ఎల్లవేళలా సమగ్ర విభవంతో వెలిగిపోతూంటాడు. అతని పాలనలో మీరు పరమ సుఖులవుతారు. వానికి మిమ్మ ప్పగిస్తున్నాను. "

ధృతరాష్ట్రుని మాటలు పౌరుల హృదయాలను కలచి వేసాయి; దిగ్భ్రాంతులై ఏడ్పులు మ్రింగుకొని ఒకరి నొకరు చూస్తూ ఊరుకొన్నారు కాని 'వారికి మాట తోచలేదట !

"ఓహో పౌరులారా! సాధుచరిత్ర, శాంతయు అయిన ఈ గాంధారీ, నేనూ వినయ మనస్కులమై మీ మాట కోసం ఎదురు చూస్తున్నాము. పరాశరుడు అఖిల ధర్మా భిజ్ఞుడు ! ఆయన అనుమతిని తీసుకొన్నాను. ధార్మికా గ్రణి యీ అజాత శత్రువు ! అతడూ అనుమతించాడు. కృపాడ్యులారా ! చేయెత్తి మ్రొక్కుతూ మీ అనుమతి నర్థిస్తున్నాను ! అనుగ్రహించండి ! "

ధృతరాష్ట్రుడిలా అనేసరికి సర్వజనులకూ దుఃఖ మాగక, మొగంమీద ఉత్తరీయములను కప్పుకొని, ఏడ్చి, ఏడ్చి, తమకుతామే ఊరార్చుకొన్నారు. తమలో తాము కూడబలుక్కున్నారు. రాజునకెవరో సమాధానం చెప్పాలి కదా ! ఆర్యచరితుడూ, చ తు ర ం గా, ధర్మోపేతంగా మాటాడడానికి సమర్థుడూ అయిన శంబువనే విప్రుణ్ణి - ఇలా ఇలా మా మాటలుగా ధృతరాష్ట్రునితో చెప్పమని నియోగించారు.

శంభువు ధృతరాష్ట్రుని సమీపించాడు. సవినయంగా పౌరజనములు పక్షాన, వారి అనుమతితో, వారి మాటలనే మహారాజు సమక్షాన మనవి చేస్తున్నానన్నాడు.

"ఓ మహారాజా ! భరత వంశోత్తమా ! మీ మహావంశములో వెదకి చూచినా, దొసగు ఒక్కటీ కనపడదు. తల్లి పిల్లలను చూచినంత ప్రేమతో మీరందరూ మమ్మల్ని ఆదుకొన్నారు. దుర్యోధనుడు చేసిన అనర్థమైన పని ఒక్కటీ మాకు కనబడడం లేదు.

"ధాత్రి శంతనుఁడు వి-చిత్ర వీర్యుఁడుఁ బాండు<br>
రాజు నెట్టు లట్ల - రాజరాజు<br>
ప్రజకు సంతసముగఁ - బాలించె నీ యందు<br>
నతని యందుఁ గలదె - యధిప యెగ్గు ! "

- ఆశ్రమ : 1- 100

"భీష్మ ద్రోణ కృప ద్రౌణి కర్ణ కృతవర్మ శల్యు లొక్కదిక్కును, భీమార్జున నకుల సహదేవ ద్రుపద విరాట సాత్యకు లొక్కదెసయునై, విధి ప్రేరణంబునం బోరిరి ! వారి వలన నఖిల క్షత్రియ సంక్షయం బావహిల్లె; నది యొక్క దుర్యోధను చేతన యయ్యెనె? " అని శంబు వన్నాడు.

ఈ మాటలు పౌరజనుల సమష్టి సంస్కారాన్ని విశిష్టంగా వెలారుస్తున్నాయి; ఔచిత్యానికి పరమార్థంగా ఉన్నాయి. ఈ వృద్ధరాజుకు ఎంతో కాలంగా మనసును వేధించేది వీళ్ళందరూ తన్నూ, తన కొడుకునూ ఎంతగానో ఏవగించుకుంటున్నారన్న అనుమానం. ధర్మరాజు అతణ్ణి ఎంత భక్తిశ్రద్ధలతో కొలిచినా, ఆ భావం మనసున తుడిచి పెట్టడమాతనికి అసాధ్యమైంది. దానిని వెలార్చేటట్టుగా ఉండేవి, ఇంత నంత నుండి ఆడే ఆ భీముని ఎత్తిపొడుపు మాటలు. ఇప్పుడీ పురజనులమాటలు వృద్ధరాజునకు ఎంతో ఊరడింపును కలిగించి ఉండాలి. పురము పురమంతా కదలివచ్చి, అతని కొడుకు తమను సంతసమొదవేటట్లుగా పాలించాడనడం, అతణ్ణి రాజరాజని అనడం, అతనికి శంతన, విచిత్రవీర్య, పాండురాజుల ప్రక్క పెద్ద

## మాకు కావలసింది

గోడమీద రాసే రాతలు
మీటింగుల్లో కూసే కూతలు
పేపర్లలో వచ్చే కోతలు
ఇవి కాదు మాకు కావలసింది
అసలైన సిసలైన నేతలు
నేతలలోని నీతుల చేతలు.

— బయ్యారపు చినమల్లేశ్వరరావు

స్థానాన్నివ్వడం, ధృతరాష్ట్రునకెంతో తృప్తిని కలిగించి ఉండాలి.

"మా అదృష్టంచేత ఇప్పుడు మమ్మల్ని పాండవులకు అప్పచెపుతున్నావు. పాండవులు భూమినేమిటి స్వర్గాన్నైనా అవలీలగా పాలింప సమర్థులు. ధర్మపుత్రుడు దీర్ఘదర్శి, అజాతశత్రువు, మహా ప్రతిభావంతుడు. ఈ పాండవులందరూ శూరులు, శాంత స్వాంతులు, పౌరజనానికీ, జానపదులకు నిత్యమూ తుష్టినీ, సంతోషాన్నీ కలిగించే వారు. అంతేకాదు :

"మృదువులకుఁ జాల మృదువులు,
విదితయశా ! వినుము పాండ - వేయులు గడు బె
ట్టిదులు బెడిదంపు వారికి !
మదలోభిత్వములు లేవు - మందున కైనన్."

ఆశ్రమ 1–104

"అందుచేత నిస్సంకోచంగా ఈ రాజ్యతంత్ర భారాన్ని ధర్మరాజున కప్పగించి, త్రిలోకోత్తరుడైన వ్యాస భగవానుడు అనుమతించినట్టుగా, నీ యిచ్ఛకు అనుకూలమైనది ఆచరించు" మని పౌరుల మాటగా శంబువు చెప్పాడు.

పాండవులను గురించి శంబువు చెప్పిన మాటలన్నీ ఒక ఎత్తు, పై కంద పద్యంలోని మాట ఒక్కటీ ఒక ఎత్తు : వారికి మదము లేకపోవడం మూలాన పాలితుల మాన ప్రాణాలకు రక్షణ ఏర్పడుతుంది. లోభితులు కారు కనుక ప్రజల ధనం, ఆస్తి సురక్షితంగా ఉంటుంది. కాని అంతకన్న గొప్ప విషయమేమంటే పాండవులు మృదువులకు కడు మృదువులు: బెట్టిదులకు కడు బెట్టిదులు! పాలకులందరూ అనుక్షణమూ జ్ఞప్తియందుంచుకొనవలసిన మాట యిది ! ఏమంటే సాధారణంగా కనబడేది పాలకులు మృదువుల యెడ కఠినంగా వ్యవహరిస్తారు – అది తేలికైన పని: దానివల్ల మిగతావారిని కూడా తేలికగా లొంగదీసుకో వచ్చునని వారి ఆశ. బెట్టిదుల యెడ పిరికితనం వల్లనౌతేనేమి, దక్షత లోపించడం వలన నౌతేనేమి, క్షమా భిక్ష పెడుతూన్నట్టు నటిస్తూ, మృదువులై ఉంటారు. ఈ రెండూ పరిపాలనా దక్షత లేకపోవడానికి తార్కాణాలు; తత్ వ్యతిరేకంగా పాండవులలో కనిపించే లక్షణాలు పరిపాలనా దక్షతకు గీటురాళ్ళు. ఈ పద్యం ఒక వంక పాండవుల రాజ్యతంత్ర నిర్వహణకు అద్దం పడుతూన్నట్టు ఉంది. ఇది తర్వాత కాలం రాజులకూ, ఇక ముందు కాలాలలో వచ్చే పాలకులకూ పాండవుల సందేశంలా ఉంది,

కాగా, ధృతరాష్ట్రుని ప్రసంగమెంత బరువుగా, లోతుగా, గుండెలను త్రవ్వుతూందో, దానికి సమాధానంగా ఉన్న శంబువు ఉపన్యాసం మనసున కంతటి ఊరట కల్గించేదిగా ఉంది. ఒకదాని ప్రక్క నొకటిగా ఉన్న ఈ రెండు ఉపన్యాసాలు, నిరుపమానమై, హృద్యమై, అపూర్వమై వీడ్కోలు ప్రసంగాలకొక సాహిత్య ప్రమాణాన్ని సంతరించి పెట్టాయి.

"ఇట్ల విప్రముఖంబునం బౌరుల భాషణంబులు విని, ధృతరాష్ట్రుండు ప్రీతుండయి, సముచిత ప్రకారం బుల నిజజనంబులం గ్రమంబున వీడుకొలిపి, కౌంతేయాది బంధువులను, మిత్రులను, నిజ నివాసంబులకుం బోవం బనిచి, గాంధారీ సమేతుండై యభ్యంతర మందిరంబున కరిగె ?"



యువతావాణి

# విద్యారంగంలో విషవలయం

పబ్లిక్ పరీక్షలు జరుగుతున్నాయి. స్కూల్ బయట పోలీసులు కాపలా ఉన్నారు. పరీక్షహాలులో వాచర్లు అటూ ఇటూ తిరుగుతూనే ఉన్నారు అయినా విద్యార్థులు బాహాటంగా కాపీలు చేస్తూనే ఉన్నారు. పాంట్‌లకు వున్న దొంగ జేబుల్లో కాపీ కాగితాలు పెట్టుకొని కొందరు, సాక్స్‌లో దోపుకొని మరికొంధరూ, ఇలా ఎవరి బుద్ధికి తోచినట్టు వారు కాపీ కాగితాలు తెచ్చుకున్నారు. నిర్భయంగా వాటిని ప్రక్కనే పెట్టుకొని జవాబులు రాసేస్తున్నారు. ఇదంతా గమనిస్తూ కూడా "మనకెందుకులే" అన్నట్లు వాచర్లు మిన్నకుండిపోయారు అంతవరకు పర్వాలేదు. హాలు కిటికీల దగ్గరకి పరీక్ష వ్రాస్తున్న వారి బంధువులు, మిత్రులు, "శ్రేయోభిలాషులు" వచ్చి లోపల విద్యార్థుల నుంచి క్వెశ్చన్ పేపర్లు తీసుకుని చకచకా వాటిని వ్రాసుకుని బయటకు పోతున్నారు. మరికొంచెం సేపట్లో ఆ ప్రశ్నలకు జవాబులున్న కాగితాలను గైడ్‌లనుంచి, ఇతర పుస్తకాల నుంచి చింపుకుని వచ్చి హాలులోని వారికి అందిస్తున్నారు. సర్క్యులేషన్ స్కీం లాగా ఈ ఆన్సర్ కాగితాలన్నీ ఒకరి దగ్గరనుంచి మరొకరి దగ్గరకు వెళ్ళిపోతున్నాయి. తాత్కాలిక అంధత్వం సంభవించినట్లుగా వాచర్లు ఇవేవీ గమనించినట్లు లేరు. "పహరా హుషార్" కానిస్తూనే ఉన్నారు. బయట పోలీసులు నిద్రకి జోగుతూ కొందరూ ఈగల్ని దోమల్ని తోలుతూ ఇంకొందరూ, "ఏ గోలా గందరగోళం లేనప్పుడు మనం కల్పించుకోవడం ఎందుకులే" అన్న నిర్లిప్తతతో మరికొందరూ తమ "డ్యూటీ"ని నిర్వహిస్తున్నారు.

ఇవన్నీ ఒక ఎత్తు. సాక్షాత్తు వాచర్లుగా వున్న టీచర్లే పిల్లలకి జవాబులు చెప్పి రాయిస్తుండడం మరొక ఎత్తు. ఇది చాలదన్నట్లు బాగా చదివి స్వయం శక్తితో రాసే పిల్లల్ని, బడుద్ధాయి పిల్లలకు జవాబులు చెప్పమనీ తమ ఆన్సర్ పేపర్లను వారికి అందించమని బలవంతం చేయడం, వారు అందుకు సంకోచిస్తే వారిపై కోపం చేయడం మరీ దారుణం.

కె. ఆర్. కె. మోహన్

ఈ తతంగమంతా విద్యార్థులు కాపీలు కొట్టే విషయంలో హైస్కూల్స్‌కీ కాలేజీలకీ కామన్ అయితే, టీచర్లు రాయిస్తుండడం సాధారణంగా హైస్కూల్స్‌లో కనిపిస్తుంది. అందులోనూ ప్రైవేటు స్కూల్స్‌లో తమ సంస్థకి ఎక్కువ పర్సంటేజి తెచ్చుకోవాలనే తపనతో, యాజమాన్యం తమ టీచర్ల చేత ఈ అకృత్యాలు చేయిస్తుంది. ఇవన్నీ ఏదో ఒక ఊరికీ లేక ప్రాంతానికీ, ఏదో కొన్ని విద్యా సంస్థలకీ పరిమితమైనవి కావు. ఈనాడు విద్యార్థులకి తాము ఏదోవిధంగా పాస్ కావడమే లక్ష్యం - ఉపాధ్యాయుల ధ్యేయం తమ పిల్లల్ని ఎలాగోలా పాస్ చేయించడం. ఈ పరిస్థితి నూటికి నూరుపాళ్ళు లేదు కానీ చాలా ఎక్కువగా మాత్రం కనిపిస్తుంది. కాపీల వంటి సులభ పద్ధతులలో ప్యాసు కాగలుగుతున్నప్పుడు కష్టపడి చదువుకోవాలనే దీక్ష, శ్రద్ధ ఎవరికుంటాయి? అలాగే సులువుగా విద్యార్థులను పాస్ చేయించే అవకాశం వుంటే కష్టపడి తయారై పాఠాలు చెప్పే ఓర్పు దీక్షా ఏ ఉపాధ్యాయుడికి ఉంటుంది? దురదృష్టవశాత్తూ ఈ పరిస్థితులు ఇంత ఉచ్చ స్థాయిలో విషమించడంవల్ల, శ్రద్ధతో చదువుకునే పిల్లలూ, దీక్షతో పాఠాలు చెప్పే ఉపాధ్యాయులూ, నిష్కామంగా బలి పశువులై పోతున్నారు. ఏ ఉపాధ్యాయుడైనా కొంచెం స్ట్రిక్‌గా వుంటే అట్టివారిని బెదిరించడం,

## కత్తి, కాంతి, కవిత

కవితలు రాస్తాను రోజుకొకటి
ఏరోజు అనుభవాల నారోజు కూడగట్టుకుని
స్పందించిన క్షణాలను మూటగట్టుకుని
కలం పాళీలోకి నేరుగా మనోభావాలు నెట్టుకుని

కవితలు రాస్తాను రోజుకొకటి
ఎలుగుబంటి సంపాదకీయాల
పక్షాల నల్లని అబద్ధాలవాడికి నిరసన ప్రకటించి
బజారు వీధుల తిరుగాడే
పెద్దపులి పాదాల చప్పుడుకి అసహ్యించి

కవితలు రాస్తాను రోజుకొకటి
ప్రత్యక్షంగా అంటుకున్న అక్రమాల
దహనం కోసం
పరోక్షంగా దాక్కున్న కుట్రల హననం కోసం
భూస్వామ్య మూఢాచారాల నంగారంలో
కల్పడం కోసం
వ్యక్తి పూజానీరాజనాల మీద తుమ్మడం కోసం

కవితలు రాస్తాను రోజుకొకటి
మనోవ్యథల కుంపట్ల మీద మరిగే భావాల
వేణ్ణీళ్ళతోటి
దేశపటం నిండా కనిపించే గ్రామాల,
నగరాల గుర్తులతోటి
వీధుల్లో కనిపించీ కనిపించని
దోమల ఈగల ఎలుకల రకరకాల
సంగీతాల సరిగమలతోటి

కవితలు రాస్తాను రోజుకొకటి
స్వేచ్ఛగా నిజాయితీగా ఘాటుగా
కత్తులకూ కాంతులకూ దీటుగా
భూతాలకూ ప్రేతాలకూ చాటుగా

— డాక్టర్ మిరియాల రామకృష్ణ

కొట్టడం కూడా జరుగుతోంది. కొన్ని సందర్భాలలో విద్యార్థుల చేతుల్లో ఉపాధ్యాయుల ప్రాణాలు కూడా పోతున్నాయి. ఈ పీడ పడలేక నిజాయితీగల ఉపాధ్యాయులు కూడా కాలానికి ఎదురీదలేక మిన్నకుండి పోతున్నారు. ఫలితం లేకపోగా, చెడ్డ పేరు తెచ్చుకోడం కంటే, విద్యార్థులకు సహాయంచేసి మంచి పేరు తెచ్చుకోడం మేలన్న అభిప్రాయానికి వస్తున్నారు వాళ్ళు. పోనీ తమగోడు ప్రిన్సిపాల్‌కి చెప్పుకున్నా వారు పట్టించుకోరు. నిజానికి ఎవరైనా పట్టించుకున్నా వాళ్ళూ అల్లరి పడడం తప్ప ప్రయోజనమేమీ ఉండదు. ఒకవేళ పోలీసుల సహాయం కోరినా అందువల్ల ఒనగూడే లాభమూ ఉండదు. ఇటువంటి పరిస్థితులలో ఉపాధ్యాయ వర్గం నిర్లిప్తంగా ఉండిపోవలసి వస్తుంది.

ఇంక విద్యార్థుల సంగతి చూస్తుంటే, అందరూ కాకపోయినా కొందరైనా శ్రద్ధగా చదివి పైకి రావాలన్న అభిలాష కలవారై ఉంటారు. వీరికి, జలసాగా తిరిగి టైమంతా పాడుచేసుకున్నట్టి విద్యార్థులకి తమ ఆన్సర్ పేపర్లు ఇవ్వడమంటే సహజంగా బాధగా ఉంటుంది. ఆ విధంగా ఇమ్మని టీచర్లు బలవంతం చేస్తుంటే వారు పైకి కాదనలేక, మానసికంగా కృంగిపోతారు. తర్వాత అందరి ఆన్సర్లూ ఒకే విధంగా ఉండడంతో, మాస్ కాపీయింగ్ క్రింద ఆ ఆన్సర్ పేపర్లని వాల్యూ చేయరు. దాంతో మంచి పిల్లల భవిష్యత్‌కి దెబ్బ తగులుతుంది. ఈ విధంగా కష్టపడి చదివినా ఫలితం లేకుండడంతో వారుకూడ కాపీలే మేలన్న నిర్ణయానికి వచ్చేస్తారు.

ఈనాటి మన విద్యావ్యవస్థ ఇటువంటి దయనీయ స్థితిలో ఉంది. ఈనాటి విద్యార్థులే రేపటి ఉపాధ్యాయులు. వీరు తాము అనుసరించిన పద్ధతులన్నీ తను విద్యార్థుల విషయంలో ఆమోదిస్తారా ? కాపీలు కొట్టి పరీక్షలు ప్యాసవడం కష్టం కాదు. కాని జీవితంలో నిజమైన పరీక్షలను ఎదుర్కొనడానికి ఇది పనికిరాదు. ప్రజ్ఞలేని వ్యక్తి ఎందుకూ కొరగాని వాడవుతాడు; ఇవి చేదు వాస్తవాలే కావచ్చు కాని అందులో ఆలోచించ వలసిన సమస్యలు. 

# పావలా కథ ~~~~ కస్తూరి

## ఆ మనిషి మళ్ళీ వస్తున్నాడు.

నిన్న వచ్చాడు, మొన్న వచ్చాడు, వారం రోజులుగా వస్తూనే వున్నాడు, ఈ రోజూ వస్తున్నాడు. ఒక్కొక్కరి ముందు చెయ్యి చాస్తున్నాడు. కొందరు చేయి కదిలిస్తే, మరికొందరు తల కదిలిస్తున్నారు...లేవని.

ఒక్క మాట లేదు, పలుకు లేదు, ముఖంలో మార్పు లేదు, చేయి చాచటం, లేవని తల ఆడిస్తే, కసురుకుంటే, ఏమీ అనకుండా ముందుకు సాగిపోతూనే వున్నాడు. ఒక కొన నుండి, మరో కొనవరకు అలాగే అడుగుతూ వెళతాడు రోజూ ఈ బస్సుస్టాప్ దగ్గరే. ఎవరిచ్చినా ఇవ్వకున్నా ముందుకు సాగి పోతాడు, మళ్ళీ వెనక్కు రాడు.

నాకు తెలిసినంతవరకు ఆ మనిషికి యేనాడు ఎవ్వరూ ఒక్క పైసా ఇవ్వలేదు.

చారల పైజమా, చారల లాల్చి, ఎప్పుడు చూచినా ఇవే బట్టలు. పడకటింటిలో పరుపుమీద పొరలాడి ఇప్పుడే బయట పడ్డాడా అన్నట్టు కనిపిస్తాడు.

పిండి ఆరవేసిన సిల్కు గులాబీ గుడ్డలాగా, పిడికిట నలిపేసిన మల్లెపూల మాలలాగా, నిండా ముళ్ళ గీతలు పడ్డ పొడుగు సొరకాయలాగా కనిపిస్తాడా మనిషి.

తెల్ల శరీరం, ముఖం నిండా మడతల చారలు, కాటుకలా కళ్ళ చుట్టూరా పేరుకుపోయిన నలుపు, సగం నెరిసిన వెంట్రుకలు, నల్ల బడ్డ పెదాలు, కచ్చకాయరంగు పులుముకున్నట్టున్న దంతాలు, అరపై అయిదేళ్ళ ఆ మనిషి ఏదో పోగొట్టుకున్నట్టు అందరినీ యాచించి, ప్రతిరోజు ఉదయం అదే 8 గంటల సమయానికి అక్కణ్ణుండి నిష్క్రమిస్తాడు.

ఈ వారం రోజులుగా నేను ఈ బస్సు స్టాప్ దగ్గరే బస్సెక్కుతున్నాను. అందరిలాగే నేను ఈ యేడు రోజుల్లో ఏ ఒక్కరోజుకూడా అయిదు పైసలు వేసిన పాపాన పోలేదు.

ఆ మనిషి దగ్గరికి వస్తున్నాడు. ఈరోజైనా వేద్దాం అనుకొని జేబులో చేయి పెట్టాను. పావలా తగిలింది. వెనుకా ముందూ చూడకుండా, నాముందుకు వచ్చిన ఆ చేతిలో ఆ పావలా ఉంచాను.

ఆ మనిషి ముందుకు సాగలేదు. కనీసం నా ముఖం కూడా చూడకుండా గిరుక్కున వెనక్కు మళ్ళాడు. పరుగెత్తినంత వేగంగా వెళ్ళాడు.

దగ్గరే పాన్‌షాప్. షాప్ ముందుకు వెళ్ళాడు. పావలా అతనికిచ్చాడు. బీడీలు తీసుకున్నాడు. షాప్‌లో ఉన్న దీపంతో బీడీ ముటించుకున్నాడు. షాప్ పక్కనే ఉన్న అరుగుమీద కూచున్నాడు. బీడీమీద బీడీ గుంజుతున్నాడు. ముఖంలో రంగులు మారుతున్నాయి. అంతవరకున్న ప్రేతకళ పోయింది. జీవకళ వచ్చింది. ఆ కళ్ళు మెరుస్తున్నాయి. ఆ బుగ్గలు కెంపులయ్యాయి.

ఏకబిగిగా ఆరు బీడీలు గుంజేశాడు ఆ ప్రాణి. నేనెంత వెధవను, ఇంత చైన్‌స్మోకర్‌కు పావలా ఇచ్చేశాను అని నన్ను నేను తిట్టుకున్నాను. కాని అతని ముఖంలో మెరిసే ఆ మెరుపును చూసి నన్ను నేనే అభినందించుకున్నాను.

# సంఘర్షణ

'ఉదయాని'కి ముందు 'అస్తమయం'
'అస్తమయాని'కి ముందు 'ఉదయం'
ఏది ముందు ? ఏది వెనక ?
అన్న ప్రశ్న పరంపరల మధ్య నలిగి
వెనక పడింది నేనే !
కానీ, కాలం కాదు.

— గన్ను కృష్ణమూర్తి

తృప్తిగా గాలి పీల్చుకొని ఆ మనిషి అక్కడి నుండి కదిలాడు. ఆఫీసైనా మానుకుని అతని కథా కమామీషు తెలుసుకోవాలనిపించింది. ఆలోచన వచ్చిందే తడవుగా అతణ్ణి అనుసరించాను.

మెయిన్‌రోడ్డు మీదుగా దాదాపు ఓ కిలోమీటరు నడిచి కుడిచేతివైపున్న గల్లీలో దూరాడా మనిషి. కొద్ది దూరం ఆ గల్లీలో నడిచి ఎడమవైపున్న, రెండతస్థుల మేడ, ప్రహరీ గేటు దీసి లోపలికి వెళ్ళాడు.

దర్వాజా ముందున్న కుక్క, తోక ఆడిస్తూ నిలబడింది. దాని దగ్గరికి వెళ్ళి కూచుని ఒళ్ళోకి తీసుకున్నాడు, దువ్వుతున్నాడు.

' బీడీల కంపు వాసన రే, కుక్కకు తగులుతుంది ' ఓ మహిళామణి గంయ్యున బయటికి వచ్చింది.

ఆ మనిషి అక్కణ్ణుండి లేచి వచ్చి గేటుదగ్గర నిలబడ్డాడు. నేను ముఖం చాటుచేశాను.

ఆ ఇంటి ఎదురుగా ఉన్న సైకిల్‌షాపులోకి వెళ్లాను.

' ఈయన్ని అట్లా కసురుకుంటుందేం ఈమె ' నాలో నేనే అనుకున్నట్టుగా మొత్తంమీద పైకే అన్నాను.

' ఆ అమ్మగారు డాక్టరు, ఆమెకు బీడీల కంపు గిట్టదు' అన్నాడు సైకిలు తుడుస్తున్న పెద్దమనిషి.

' ఈయనకేం కావాలి '

' కోడలు '

' ఈ ఇల్లు '

' కండక్టరుగా ఉండి ఈయన కమాయించిందె '

" అయ్యో పాపం "

" పాపమే మరి ! ఓ కోటి రూపాయల బిల్డింగుంది. కొడుకు డాక్టరు, కోడలు డాక్టరు. నెలనెలా వేలకువేలు సంపాదిస్తున్నారు. కనీసం బీడీలకు పావలా ఇవ్వరు. ఈయన బస్సుస్టాపుల దగ్గర అడుక్కుంటాడు. అయిదు పైసలు దొరికితే చాలు, దాంతో ఒక్క బీడీ కొనుక్కొంటాడు. ఆ రోజు ఇక ఎవరినీ యాచించడు. "

" చిత్రంగా ఉంది బతుకు "

" చిత్రమేం కాదు. ఆయన భార్యకు కూడా బీడీలు తాగే అలవాటుండేంది. ఆమె రెండేళ్ళయ్యింది మరణించి. మరో క్షణంలో ప్రాణం పోతుందనగా ఆమె బీడీ కాల్చి తెమ్మంది భర్తతో — ఇతడు తీసుకొని వచ్చేవరకే ఆమె ప్రాణం పోయింది. ఆ తర్వాత ఏడాదివరకు కట్టలు కట్టలే త్రాగాడీయన. శరీరం నిండా బీడీల కంపు వాసనే. ఇతణ్ణి కదిలే బీడీల కంపు అని కోడలు ఈసడించుకో సాగింది. కొడుకు తండ్రిని పరీక్షించి ఆరోగ్యదృష్ట్యా బీడీలు తాగొద్దన్నాడు. ఇతడు వింటేగా. అయిదు పైసలు కూడా అందకుండా కట్టడి చేశారు కొడుకూ కోడలు. నేనోసారి అడిగానతణ్ణి ఎందుకు ఈ పాడు బీడీలు తాగడం మానుకోవాల్సింది అని. కాని ఏమన్నాడో తెలుసా ! బీడీ తాగుతుంటే నా భార్యతో కలిసిఉన్నంత ఆనందం కలుగుతుంది అని " — నిట్టూర్చాడు ఆ పెద్ద మనిషి.

జీవకళ ఉట్టిపడ్డ ఆ ముఖం మెరుపుల వెనుక ఇంత కథ ఉందని నాకేం తెలుసు మరి.

బీడీలు తాగడం అనారోగ్యమే. రెండు మనస్సుల కలయికలో పొందే ఆ ఆనందం ముందు ఈ అనారోగ్యం ఓ లెక్కా పక్కా. "ఒక్క పావలాకే ఇంత కథలానిస్తే రోజూ పావలాదానం చేస్తా, రోజుకో కథ పేపరు కెక్కిస్తా " అనుకుంటూ కదిలానక్కణ్ణుండి. ★

# జాషువా దేశభక్తి కవిత

దేశభక్తికి స్వధర్మము, ఋతము మూలభూతము లైన విషయములు. వేదకాలమునాటి ఋషులు పాడుకొనిన నదీ సూక్తము, పృథివీ సూక్తము మున్నగునవి దేశమాత యొక్క బాహ్య స్వరూప కీర్తనముయొక్క లక్షణములు. భారతదేశము కర్మభూమి. కర్మాచరణమునకు దేశభక్తి మూల సత్వమని వారు గమనించిరి. 'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అను ప్రాచీన సూక్తి ఈ విషయమునే అభివ్యక్తము చేయుచున్నది. ఆధునిక కవులు గాన మొనర్చిన దేశభక్తి మాత్రము జాతీయ భావము నుండి పుట్టినది.

సాహిత్యమునకు దేశభక్తి పుష్టినిచ్చును. సాహిత్యము దేశభక్తిని ఉద్దీపింపజేయును. జాతీయ జీవితమునకు సాహిత్యము ప్రతిబింబమే కనుక, కడచిన నూరేండ్ల నడుమ భారతీయ సాహిత్యములో దేశభక్తి ఒక ప్రధాన కథావస్తువై కమనీయ కావ్యముల అవతరణమునకు కారణమయ్యెను. బంకించంద్రుని 'వందేమాతరం' అను గీతము స్వరాజ్య సమర శంఖారావమై దేశపు నలు మూలల ప్రతిధ్వనించింది. ఈ శతాబ్దము మొదట మన దేశమునందేర్పడిన రాజకీయ సంచలనమునకు ఫలితముగ 'జారిన దేశ గౌరవము' చక్కదిద్దుటకై జాతీయతా ప్రబోధకములైన కావ్యములనేకములు మన భాషలో వెలసినవి. దేశభక్తి కవిత చిలకమర్తిలో మొలకెత్తినను, గురజాడలో నిలద్రొక్కుకుని మారాకు తొడిగినది. అతడు 'దేశమును ప్రేమించుమన్నా' అని యెలుగెత్తి పాడినాడు. దేశ ప్రేమ చిగురులెత్తి పూలు పూచినది. రాయప్రోలు, విశ్వనాథ, తుమ్మల, కొడాలి, దువ్వూరి, జాషువ, బసవరాజు ప్రభృతుల ఖండకావ్యములు, ఇంకను కొన్ని ప్రసిద్ధములైన వీరగాథా కావ్యములు దేశభక్తి తెలుగునేలపై పండించిన బంగారు పంటలు.

ఆధునికాంధ్ర కవిత్వములో దేశభక్తి రెండు పాయలుగా ప్రవహించినది. ఒకటి భారత జాతీయాభిమాన సంబంధి; రెండవది ఆంధ్రాభిమాన సంబంధి.

## ఆచార్య భావన్

ప్రజలయందు స్వాతంత్ర్యాభిలాష, ఆత్మ గౌరవము నుదయించిన గాని సంఘమునందెట్టి నూతనోద్యమములును బయలుదేరవు. దేశమున నేదోయొక ఉద్యమము తలయెత్తిన గాని కవులయందు నవ చైతన్యము, ఉత్తేజము గలుగవు. అట్టివి కలిగినపుడే సృజనాత్మకములైన వుత్తమ కావ్యములు వెలువడును. వానియందే జాతీయ జీవనము స్పష్టముగా చిత్రితమై యుండును. ఆంగ్ల దేశీయుల తోడను, వారి వాఙ్మయము తోడను మనకు ఏర్పడిన చిరకాల సంబంధము యొక్క ఫలితములు మన జాతీయ జీవనమునందును, మన వాఙ్మయమునందును కనబడుచున్నవి. ఆత్మ గౌరవము, స్వాతంత్ర్యాభిలాష, త్యాగము, దేశభక్తి, జాతీయానురక్తి మున్నగు నుదార భావములు ప్రజలయందు రేకెత్తినవి. రవీంద్రనాథ ఠాకూరు మున్నగు మహా కవులు ప్రాచీన భారత విజ్ఞాన వైభవమును కొనియాడుచు, భారత జాతియందలి నూతనోద్బోధమునకు తోడ్పడు రచనలు గావించిరి.

జాషువాగారి యాంధ్రాభిమానము యావద్భారతాభిమానమునకు అడ్డు రాలేదు. భారత పరివ్యాప్తమైన అభిమానము ఆంధ్రాభిమానమునకు అవరోధము కలిగింపలేదు.

### భారత జాతీయాభిమానము :

చిలకమర్తివారి "భరత ఖండంబు చక్కని పాడియావు...." అను పద్యము తెలుగులో భారత జాతీయో

ద్యమ సంబంధమైన తొలి రచన యని చెప్పవచ్చును. జాషువాగారి " భరతమాత ", " నవభారతము " అను ఖండికలలో అది వెల్లివిరిసినది.

" సింధు గంగానదీ జలక్షీరమేపుడు ।
గురిసి బిడ్డలఁ బోషించుకొనుచునున్న
పచ్చి బాలింతరాలు మా భరతమాత,
మాతలకు మాత, సకల సంపత్సమేత "

ఇంకను భారతమాతను వర్ణించుచు, కాళిదాసాది సత్కవి కుమారులను కాంచి కీర్తిని పొందిన పెద్ద గేస్తురాలనియు బుద్ధుడు మొదలగు వారి తపములకు మోద బాష్పములను విడిచిన భక్తురాలనియు కొనియాడినారు.

" నవ భారతోదయంబున
యువకుల చిత్తములలోన నుత్సాహ ఝరుల్
ప్రవహించి పల్లవించెను
గవితోద్యానములు సత్య గంధాఢ్యములై. "

అని నవభారతోదయమును ప్రశంసించినారు. ఈ విధముగా జాతీయాభిమాన కవితా రేఖలు జాషువాగారి ఖండికలలో తొంగి చూచుచున్నవి. భారత జాతీయోద్యమ కవిత్వము ఆంధ్రదేశములో వెల్లివిరియుటకు, దేశములోని ఉద్యమాలతోపాటు రవీంద్రుని జాతీయ గేయములు కూడ కొంతవరకు నుపకరించిన వనవచ్చును.

## స్వాతంత్ర్య ప్రబోధము — ఆంధ్రాభిమానము :

తెలుగులో వెలువడిన దేశాభిమాన కవిత్వములో ఆంధ్రదేశాభిమాన సంబంధి కవిత్వమే విస్తారముగా నున్నది. భావకవులలో రాయప్రోలు, విశ్వనాథ, కొడాలి, జాషువ, తుమ్మల మున్నగు వారు ఎక్కువగా ఆంధ్రాభిమానమును వెలార్చినవారే.

జాషువాగారు " ఆంధ్రుడను " అను ఖండికలో ఆంధ్ర దేశాభిమానమును చాటుటయేగాక, ఆత్మగౌరవమును కూడ వెలిబుచ్చినారు.

" బహు దేశములను వేర్వడసి మీసముదీటు
భరత ఖండంబు నా పాఠశాల
స్తన యుగంబున గాన సాహిత్యములు గల్గు
భాషా వధూటి నా పంతులమ్మ
సాందీపని సమక్షమందు విద్యగడించు
వనమాలి నా సహపాఠకుండు
భక్తి వైరాగ్య భావముల తావలమైన
భాగవతంబు నా బాలశిక్ష.
గంటము ధరించి మోహనాక్షరము లెనయ
ప్రతిఫలించెడు నా మహోన్నత విభూతి
వ్రాసికొందును దశదిశా ఫలక పంక్తి
గడనకెక్కిన యాంధ్ర పుత్రుడను నేను. "

ఈ ఖండికలోని పద్యములన్నియు ఆత్మాశ్రయ రీతిలో నున్నవి. " గడనకెక్కిన యాంధ్ర పుత్రుడను నేను "; " మడమ ద్రిప్పని యాంధ్ర వీరుడను నేను "; " నుడువు దప్పని యాంధ్ర భూపుడను నేను "; " రాణ జెలువారు నాంధ్ర వర్తకుడను నేను " ఇత్యాదిగా సగర్వముతో గుండె మీద చేయివేసికొని తమ యాంధ్రత్వమును కవిగారు నిరూపించినారు. ఇది వీరి యాంధ్రాభిమానమునకు, ఆంధ్రత్వముతో వీరు పొందిన తాదాత్మ్యమునకు గీటురాయి.

ఆంధ్రాభిమానము ముప్పేటలై పెనవేసికొన్నది. ఒకటి జాత్యభిమానము, రెండవది దేశాభిమానము, మూడవది భాషాభిమానము. ఈ మూడింటికిని గత వైభవ స్మరణము, వర్తమాన స్థితిపట్ల విచారము, భవిష్యత్కర్తవ్య ముఖ్య లక్షణములు జాషువాగారిలో ముప్పిరిగొన్నవి.

జాషువాగారు తమ ఖండికలలో ఆంధ్రుల పరాక్రమ ఘట్టములను వర్ణించినారు. శ్రీకృష్ణరాయ ధాత్రీనాయకుని సమగ్ర ప్రతాపమును, బొబ్బిలి వీరుల పరాక్రమమును, వెఱపు గిరపు లేని వీర విక్రమశాలియైన బాలచంద్రుని శౌర్యమును పలుతావుల ప్రస్తావించినారు.

ఆంధ్రదేశము గతములో సాగించిన విదేశ వాణిజ్యమును, నౌకా వ్యాపారమును, సాధించిన సిరిసంపదలను,

జాషువాగారు తమ "రాష్ట్రపూజ" అను కావ్యములో అత్యంతావేశముతో స్మరించినారు.

లలితకళలలో శిల్ప, సంగీత, కవిత్వములందు ప్రాచీనాంధ్రులు సాధించిన కౌశలమును తనివితీర కీర్తించినారు. నన్నయ్య, తిక్కనాద్యాంధ్ర కవుల ప్రశస్తి ఎల్లలు దాటిపోయినది. శిల్పములో ఆంధ్రులు ప్రపంచ విఖ్యాతి గాంచిరని వీరి అభిప్రాయము. "తాజమహలు" నిర్మించిన వారిలో ఆంధ్రులు పలువురున్నారని జాషువాగారు భావించినారు.

జాషువాగారి "గబ్బిలము" అను కావ్యమునందు దురాచార విమర్శనముతోపాటు దేశారాధనము కూడ ప్రధానోద్దేశమై యున్నది. గబ్బిలమునకు కైలాస మార్గమును నిర్దేశించు సమయమున యావద్భారతములోని ప్రధాన ప్రదేశములన్నింటిని జాషువాగారు తనివిదీర వర్ణించినారు.

జాషువాగారు తమ ఖండికలలో గోదావరి, కృష్ణా నదులను బహుధా ప్రశంసించినారు.

"భద్రగిరి రామ పాదుకా స్పర్శనంబు
గణనకెక్కిన కోటి లింగాల పూజ
కలిగి పయనించు హంసికాగమన నీవు
గౌతమీ గంగ ! రమ్మ స్వాగతము గొమ్మ!"

"ప్రతిఫలాపేక్ష లేక భూ ప్రజలకెల్ల
తీర్థ దానంబు చేయు నదీమతల్లి
కదలి రావమ్మ మా పేద గ్రామములకు
నతిశతంబులు నీకు కృష్ణా ప్రవంతి !"

అని భక్త్యంజలులను సమర్పించినారు.

"స్వయంవరం" అను కావ్యములో స్వాతంత్ర్యాభిమానమును వెల్లడించుచు –

"చిరకాల పరాధీనత
విరుగడ గావించి, శాంతి వెలయించిన య
చ్చిరు నగవుల చినదానిని
స్వరాజ్యమని పిలిచిరెల్ల జగము నుతింపన్."

అని స్వరాజ్య రమను ప్రశంసించినారు.

## బకింగ్‌హామ్ ప్యాలెస్

లండన్‌లోని బకింగ్‌హామ్ ప్యాలెస్ బ్రిటీష్ పాలకుల నివాసగృహము. దీనిలో 10 వేల కిటికీలు, 300 గోడ గడియారాలు ఉన్నాయి. 1703లో దీనిని బకింగ్‌హామ్ డ్యూక్ నిర్మించాడు.

దేశభక్తి కవిత్వమునందు ఆంధ్రరాష్ట్ర భావన కూడ ప్రధానాంశమై యున్నది. జాషువాగారు ఆంధ్రరాష్ట్ర భావనను కూడ వ్యక్తీకరించి యున్నారు. ఈ సందర్భమున "రాష్ట్రపూజ" అను కావ్యము పేర్కొన దగి యున్నది. ఇంకను జాషువాగారు "గాంధి ప్రశస్తి;" "ఖాదీ ప్రశస్తి" అను అంశములను కూడ తమ కావ్యములందు వెల్లడించినారు.

"ఒక్క రక్త బిందు వుర్విపై జిందిన
కంటనీరు నించి కలతజెందు
వెన్నవంటి హృదయ మున్న సుస్థిర వీర
శాంతి రచయితలకు స్వాగతంబు."

అని జాషువాగారు దేశభక్తులైన శాంతి రచయితలకు స్వాగతమును పలికినారు.

దేశభక్తి కవిత్వము ప్రాచీనమున అంతర్గతమును, ధార్మిక ఛ్ఛాయలు కలిగినదియును కాగా; నవీనమున ప్రత్యేకముగ నొక శాఖగా నేర్పడినదియును, రాజకీయ ఛ్ఛాయలు కలిగినదియును అయి యున్నది. జాషువాగారి దేశభక్తి కవిత్వమునందు ధార్మికచ్ఛాయలు, రాజకీయ ఛ్ఛాయలు రెండును మేళవించుకొని యున్నవి. ఈ మేళవింపు జాషువాగారిలో నున్న సంప్రదాయ నవ్యతల సమన్వయ ధోరణిని చాటుచున్నది.

★ ★

# అయిదు సంవత్సరాలుపాటు నక్కని వేటాడిన ఆసామి

హాలెండ్ దేశంలోని పెడ్ బోస్టక్స్ అనే రైతు జీవితం 50 ఏళ్ళదాకా ఎంతో ప్రశాంతంగా సాగిపోయింది. అతనికి 40 ఎకరాల పొలం, అందులో ఇల్లు ఉన్నాయి. ఆ ఇంట్లో ఆయనతోపాటు, తల్లి, సోదరుడు కూడా నివశిస్తుండేవారు.

ఓ నక్క వల్ల పెడ్ జీవితంలో విచిత్రమైన మార్పు వచ్చింది. ఎక్కడనించి వచ్చిందో, ఓ నక్క వచ్చి ఓ రాత్రి పొలంలో ఓ మూల పెంచబడుతున్న కోళ్ళని, కుందేళ్ళనీ చంపి తిని పోయింది.

## మల్లాది వెంకటకృష్ణమూర్తి

పెడ్ మర్నాడు రాత్రి ఆ కోళ్ళ ఫారం దగ్గర ఆ నక్కకోసం కాపేశాడు. దాన్ని కాల్చి చంపడానికి తుపాకి తీసుకెళ్ళాడు. ఆ రాత్రి నక్క మళ్ళీ వచ్చింది. చక్కగా భోజనం చేసి వెళ్ళింది. పెడ్‌కి దొరకలేదు. దాంతో మర్నాటి రాత్రి కూడా పెడ్ దాన్ని చంపటానికి వెళ్ళాడు. ఓ చెట్టు క్రింద రాత్రంతా జాగారం చేశాడు. కాని ఆ గుంటనక్క మళ్ళా పెడ్ కళ్ళల్లో కారం చల్లింది. పెడ్‌లో పట్టుదల పెరిగింది. ఆ మర్నాటి రాత్రి కూడా దానికోసం కాపేశాడు. కాని అది దొరకలేదు. మర్నాటి రాత్రి, మళ్ళీ ఆ మర్నాటి రాత్రి, ఆ మర్నాటి రాత్రి .... వరుసగా అయిదు సంవత్సరాలు పెడ్ ప్రతిరాత్రి గడిపాడు. అది దొరకకుండా తిరిగేకొద్దీ ఆయనలో పట్టుదల రోజు రోజుకీ, వారం వారంకీ, నెలనెలకీ, సంవత్సరం సంవత్సరంకీ అధికం కాసాగింది. ఈ అయిదు సంవత్సరాలలో ఏ ఒక్క రోజుకూడా ఆయన మళ్ళా ఇంట్లో పడుకోలేదు. ఇంటికి కేవలం భోజనం చెయ్యటానికి వచ్చేవాడు.

వర్షపు రాత్రుళ్ళలో మంచు కురుస్తున్న చలి రాత్రులలో ఆయన చెట్టుకిందే మకాం వేసేవాడు. దానికోసం చూస్తూ క్రమంగా చెక్కలతో చిన్న షెడ్ లాంటిది నిర్మించుకొని అందులో కూర్చుని భోజనానికి వచ్చే నక్క కోసం ఓపికగా ఎదురు చూసేవాడు. ఆయన బ్రహ్మచారి కాబట్టి ఇంటి దగ్గర భార్యా బిడ్డలు ఎదురు చూస్తారనే బాధే లేదు.

ఓ రోజు నక్క తన వాసనని గుర్తించకూడదని బావి నీటితో స్నానం చేసి ఎదురు చూడసాగాడు. దీనంగా చర్చిలో రెండు గంటలు కొట్టడం విన్నాడు. కాసేపటికి రెండు చెవులు ఆయన కంట బడ్డాయి. తుపాకీ ఎత్తి గురి చూసి పేల్చాడు.

ఆయన కోరిక ఫలించింది. అయిదారు సంవత్సరాలు ఆయన్ని ఏడిపించిన ఆ నక్క అక్కడే మరణించింది. ఆయన ఉద్దేశ్యంలో అది అతి తెలివయిన, అతి బరువయిన నక్క.

ఇప్పుడాయన తన ఇంట్లో పడుకోవడం లేదు. అయిదు సంవత్సరాలు ఆరుబయట పడుకోటానికి అలవాటు కావటంతో బయటే పడుకుంటున్నాడు. 

## నత్త నడక

అతి నెమ్మదిగా నడవడంలో నత్త ప్రసిద్ధికెక్కింది. నత్త గంటకు 58 సెం. మీ. దూరం నడుస్తుంది. అంటే అర మీటర్‌కు కొద్దిగా మించి నడుస్తుంది.

# శ్రీకరం లక్ష్మీకరం

హిందువులు ఏ శుభకార్యం ప్రారంభించినా శ్రీకారంతో ఆరంభించటం సంప్రదాయం. తెలుగువారి తొలికవి నన్నయ భారతాన్ని తెనుగు చేస్తూ "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ" అంటూ మొదలుపెట్టాడు.

మన దేవతలు శ్రీరామ, శ్రీకృష్ణ మున్నగువారు. దేవతల పట్ల మనకున్న భక్తిని పూజ్యభావాన్ని సూచిస్తూ శ్రీకారం ఆ పదం ముందు వ్రాస్తాం.

"వాచః అభివదనస్య యదగ్రం పురోభాగః
స శ్రీస్తైవ శ్రీరేవభిలు, బహూనాం మధ్యే
యస్య వాక్ ప్రథమం ప్రవృత్తా స శోభతే
తథాసతి ఏతత్ పాఠే నాస్మిన్ యజ
మానే శ్రియమేవ దదాతి" (సాయణ భాష్యం)

పలువురి మధ్య ఎవడు మొదట మాట్లాడునో అతని వాక్కు వాచోగ్రము. అదియే మిగుల శోభించును. అట్టి వాక్కుకు "శ్రీః" అని పేరు అన్నారు నిరుక్తకారులు.

లోకంలో అందరికంటే ముందుగా ఎవడేపనిని ప్రారంభించినా, అట్టివానిని జూచి ఇతడీపనికి శ్రీకారం చుట్టినవాడు అనటం మన సంప్రదాయం.

"లౌకిక విద్యలకు మూలమై విజ్ఞానానికి మొదట శ్రీకారం చుట్టిన వాగగ్ర విద్యను శ్రీవిద్య" అంటారు. దాదాపు యాభై ఏళ్ళ క్రితం వరకు వీధిబడికి అందరి కంటే ముందుగా హాజరైన విద్యార్థి శ్రీ ఆ తర్వాత "చుక్క" అని క్రమపద్ధతిలో పేర్లు పలకలో వ్రాసి పంతులయ్యకు చూపేవాడు మొదట వచ్చిన విద్యార్థి.

వేదాల్లో శ్రీ-ర, పారసీకుల "అవెస్తన్" భాషలో "శ్రీ-ర" పదములు సంపదను సూచించు అర్థంలో ప్రయోగింపబడినట్లు కనిపిస్తుంది. మంచి లక్షణాలున్న మేకలకు ఋగ్వేదంలో శ్రియః పుత్రాః అన్న ప్రేమ పూర్ణమైన వర్ణన వున్నది.

"శ్రియే జాతః శ్రియ ఆనిరియాయ, శ్రియం వయో.... మున్నగు ఆశీర్వాదమంత్రాలు శ్రీకారమయంగా వున్నాయి. అంతేకాదు "శ్రీ" యే దేవతయై విష్ణు పత్ని అయింది. శ్రీకరమైన శ్రీసూక్తం ఋగ్వేదంలో కనిపిస్తుంది. "శ్రియం దేవీ ముపహ్వయే" అంటూ శ్రీదేవి స్తుతి. శ్రీ విద్యోపాసకులచే ఆరాధనలందుకుంటున్న లలితాదేవి స్తోత్రం "శ్రీ మాతా శ్రీ మహారాజ్ఞీ" అంటూ ప్రారంభింప బడింది.

### జానమద్ది హనుమచ్ఛాస్త్రి

వైదిక మతం నుండి యీ శ్రీదేవి బౌద్ధమతం వరకూ వ్యాపించింది. శ్రీ మా దేవి (శ్రీర్మాదేవీర్జుషతాం) బౌద్ధ ప్రాకృత భాషలలో "సిరిమా" గా పరిణమించి బౌద్ధమత ప్రధానమైన దేశాలలో ప్రచురంగా వున్నది. శ్రీలంక మాజీ ప్రధాని పేరు సిరిమావో బండారునాయక.

మనం గౌరవించే పెద్దలను శ్రీమాన్, శ్రీమతి, శ్రీయుత అని సంబోధిస్తాము. బెంగాలీలు తమ పేరు ముందు తామే "శ్రీ రవీంద్రనాథ్" అని వ్రాసుకోవటం అలవాటు.

అందాన్ని మించిన సౌందర్యం కానవచ్చినపుడు ముఖశ్రీ, వనశ్రీ, హృదయశ్రీ అంటాం.

యతీశ్వరులను - సన్యాసులను శ్రీపాదులు అంటాము. వీరి పట్ల మన గౌరవాన్ని యితోధికంగా ప్రకటించునపుడు శ్రీశ్రీశ్రీ అంటూవుంటాం.

దేవతలు శ్రీవల్లభులు. లక్ష్మిని వక్షస్థలమున నెక్కించుకుని విష్ణువు శ్రీనివాసుడయ్యాడు. శివుడు శ్రీకంఠుడయ్యాడు. గంధపు చెట్టు శ్రీఖండం. బిల్వం శ్రీఫలం. మహారాజుల నుండి పంపబడే ఆజ్ఞాపత్రము

## బాపు బొమ్మ

బస్‌స్టాండ్‌లో బుక్‌స్టాల్‌లో
బాపు బొమ్మల కొలువు –
ప్రయాణీకులకి గ్రీటింగ్స్ చెపుతూ.
అందరికన్న ఎక్కువగా
సుందరి ఒకతె ఆకర్షిస్తుంది.
కళ్ళు కలువలుగా
ఒంపులు అలలుగా
బాహుకూలాల మధ్య
వయసు వరదై పారుతుంది.
ముడి విడివడి
నీలికురుల గంగ
గుండ్రని భుజాల కొండల మీంచి
విశాలమైన వీపు మైదానం మీదకి
దూకుతుంది.
బాపు గీసిన కలలో
చూపు దక్కి కరిగిపోతూండగా
బస్సు హారన్
చెంతనే గూబ గుయ్యిమనిపించి
కొలువులో ఉన్న నిన్ను
పిలుచుకు వెళుతుంది, ఉన్నపళంగా.

– గోదావరిశర్మ

శ్రీముఖం అని పిలువబడుతున్నది. పీఠాపతుల సందేశాలను కూడా శ్రీముఖాలంటారు.

నేరస్థుల శిరచ్ఛేదం కావించేందుకు వుపయోగించు ఖడ్గాన్ని "శ్రీగర్భ" అంటారని మహాభారతం పేర్కొన్నది. అమంగళమును మంగళమంటూ దాని దుష్ప్రభావాన్ని నాశనం చేయటం ప్రాచీనుల నమ్మకం.

తమిళ భాషలో "శ్రీ" "తిరు" గా రూపాంతరం చెంది – తిరువేంకటేశ, తిరునారాయణ, తిరుపతి, తిరునీలకంఠ అయ్యాయి. తిరునాళ్ళ (శుభదినం)

ఆధునిక కవులలో కలంపేరు చివర శ్రీకారం పెట్టుకొనేందుకు శ్రీకారం చుట్టిన వారు జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు. వారి కావ్యాలు కరుణశ్రీ, విజయశ్రీ. వారి కలం పేరు కరుణశ్రీ. ఆకాశవాణి ద్వారా సుపరిచితులు ఉషశ్రీ.

మతపరమైన సంకేతాలుగా శివశ్రీ (వీరశైవులు) మధ్వశ్రీ (మధ్వమతానుయాయులు).

"శ్రీ", అన్నా "లక్ష్మి" అన్నా ఒకటే అని భావిస్తాము కాని భాషాపరంగా వీరిద్దరి మధ్య వ్యత్యాసం కనిపిస్తుంది.

లక్ష్మి శబ్దానికి మూలం లక్ష్ ధాతువు. లక్ష్ అంటే గుర్తించు, చూడు, గురిపెట్టు అని అర్థాలు. లక్షణం అంటే దేనిద్వారా గుర్తించగలమో అది. ఆ గుర్తులను బట్టి హితమో, అహితమో నిర్ణయింపబడుతుంది. లక్షణము అంటే అందమైనది, శుభకరమైనది. అమ్మాయి లక్షణంగా వుంది అంటాం. గౌరీదేవిని "సర్వ లక్షణ లక్షణ్యే శివే" అంటూ ప్రార్థిస్తాం. ఈమె పుణ్య లక్ష్మి.

"జ్యేష్ఠా లక్ష్మి" అన్న దేవత దారిద్ర్యాన్ని అశుభాన్ని కలుగచేస్తుంది. అందుకే "అలక్ష్మిర్మే నశ్యతాం" (అలక్ష్మి నాశనమగుగాక).

క్షీరసాగర మథనంతో సముద్రము నుండి పుట్టిన దేవత లక్ష్మి. అందువల్లనే సముద్రం నుండి లభించే ముత్యము "లక్ష్మీద్రవ్యం" అని పిలువబడింది.

ఇతిశ్రీః అంటూ రచనను ముగించటం కూడా మన సంప్రదాయంగా వుంది.



# సర్వే జనా స్సుఖినో భవంతు

"విద్యావాచస్పతి"
ప్రభాకర శ్రీకృష్ణభగవాన్

1. ఏ ఒక్కరి కోసమో హిమాలయము పుట్టలేదు
ఒక్కరికై మందాకిని ఉర్విని ప్రవహింపబోదు
ఎవరెస్టు శిరమ్మునెత్తి ఎల్లప్పుడు విలోకించు
కోటీశ్వరుతోపాటే కూలివాని కొండబేడు
అమృత హస్తాలతో ఆశీర్వచనమ్మిచ్చును
పండితాళితో పాటే పామరులను 'గంగమ్మ'
ఎంత పెద్దవారలైన అంతమ చింస్వాంతమ్ముల
లోకమ్మున మెలగునాడు నాకమ్మే భూమి కూడ.

2. గగనములో యోగబలము అనలములో ఐశ్వర్యము
వాయువులో ప్రాణశక్తి జలములో జీవశక్తి
పుడమితల్లి మాతృప్రేమ కడలిరాజు గాంభీర్యము
ఏ ఒక్కరి సొమ్ముగావు ఎన్నటికీ వమ్ముగావు

3. భౌతిక సౌందర్యానికె చేతములుప్పొంగరాదు
అంతరంగ సౌందర్యమే అన్నిటికన్న మిన్న

4. మానవతాదృక్పథమే ప్రాణము మానవజాతికి
అది మృగ్యమైననాడు అరణ్యమే అవనియెల్ల

5. సత్యాన్వేషణకై సాధన మవసరమను
సత్యము గుర్తించినపుడె సాగును జీవితయాత్ర

6. సర్వజనుల హితమేదియొ సకల జనుల మతమదియే
సంస్కారుల అభిమతమది సహృదయుల
సమ్మతమది

7. చీకటిలోనే క్రుగ్గుచు చీకటినే తిట్టుకొనుచు
చీకటినే చుట్టుకొనుచు చింతించుట కాదు బ్రతుకు
గుండెలోని కాంతి దివ్వె కొండెక్క లోపలనే
విజ్ఞాన స్నేహముతో వెలుగును రక్షించవలయు

8. సమతయు మమతయు జనతకు చక్కగ
పెంపొందవలయు
సకల జనులు ప్రశాంతికై సాధన సాగించవలయు

9. సర్వజనులు సుఖానికై శోధన సాగించవలయు
అపుడే శాంతి హృదయాలకు అపుడే కాంతి లోకాలకు.

( ఆకాశవాణి విజయవాడ వారి సౌజన్యంతో )

## ఎదురుచూసి ఎదురుచూసి విసుగెత్తి రామచంద్రమూర్తి ఇంటికి బయదేరాడు దయానిధి.

అక్కడ... వాతావరణం మరోలా వుంది. ఏమైందా అనుకుంటూనే " రామచంద్రమూర్తీ ! " అని పిలిచాడు.

" ఆయనికి వొంట్లో బాగులేదండీ ! "

" అరె ! ఏమయింది ? నిన్న రాత్రి వరకూ బాగానేవున్నాడే. "

" అర్థరాత్రి నుంచే... రండి... చూద్దురుగాని... "

ఆమె వెంట ఆ గదిలోకి వెళ్ళాడు దయానిధి.

రామచంద్రమూర్తి మంచంమీద పడుకుని వున్నాడు.

" ఏం జరిగింది ? " అడిగాడు దయానిధి అతని భార్యను.

" అర్ధరాత్రి.... గట్టిగా అరిచారు.... "

నేను త్రుళ్ళిపడి లేచాను " ఏమిటండీ ? ఏమైంది ?"

" బాబోయ్ ! నన్ను చంపడానికొస్తున్నారు. వొచ్చేస్తున్నారు.... "

తెల్లబోయాను. " మిమ్మల్ని చంపడమేమిటి ? ఎవరు ? ఎందుకొస్తున్నారు ? మీరేం చేశారని ? " గట్టిగా కుదిపాను మనిషిని.

" క్షమించండి....నేను నవల రాయను....నిజంగా.... త్రికరణశుద్ధిగా.... ప్రమాణంచేసి చెబుతున్నాను.... నేను సీరియల్ రాయను. సమాజానికి ద్రోహం చేయను. నా మాట నమ్మండి. వొట్టు.... "

ఏ పీడకలో వొచ్చి - కలవరిస్తున్నారేమో అనుకున్నాను. ముఖం మీద నీళ్ళు జల్లాను. ఆయన కనులు తెరిచారు. పెర్రివాడిలా చూశారు. ఆ చూపు మామూలుగా మాత్రంలేదు. ఆయన దేనికో చాలా భయపడుతున్నట్లున్నారు.

పెద్ద దీపం వేశాను గదిలో. "కొంచెం కాఫీ తాగుతారా వేడివేడిగా ? " అడిగాను.




జవాబు లేదు. ఇంకా ఆ పిచ్చివాలకమే.

పైత్యం చేసిందేమో అని నిమ్మకాయ నీళ్ళు కలిపి యిచ్చాను. తాగారు కానీ ధోరణి మారలేదు. " నేను మీ అందరికీ అన్యాయం చేస్తున్నాను. నవలలు రాసి డబ్బు సంపాదించలేకపోతున్నాను....ఏం ? ఏం చెయ్యమంటారు ? నవల రాశానో నేను బలవంతంగా చచ్చిపోతాను. నవల రాయడం నా తరం కాదు...."

"పోన్లెండి.. ఇప్పుడు మిమ్మల్ని నవల రాయమని ఎవరు బలవంతపెట్టారు ? మనం ఉన్నంతలో బాగానే బతుకుతున్నాం. అందరూ నవలలు రాసే బతుకుతున్నారా ఏం ? మీరు బాగుంటే మాకదే పదివేలు. "

" మధుమూర్తీ ! చూడు....అటు చూడు....పాముల రచయిత అతని చుట్టూ పాములు.... అతని వొంటి

(జరిగిన కథ)

అనురాగం రచయిత్రిని ఒక బొమ్మతోపాటు గదిలో బంధించటం, ప్రేత సాహిత్య రచయితని అర్థరాత్రి - అమావాస్య - ఊరు చివర శ్మశానంలో వదిలేసి దెయ్యాలతో కలిసి మంచి నవల రాయమని వదిలేసి రావటం, ఆడా మగ ఒకటే అన్నామెకి స్త్రీ పురుషుల సహజీవనంలో సౌందర్యాన్ని సృష్టించమని చెప్పి వాళ్ళని మంచి స్నేహితులుగా చెయ్ బద్ధ శత్రువుల్లా కాదని బోధించటం, పెళ్ళికి ముందు అనుభవం ఉండాలన్న రచయిత కళ్ళముందే ఒకరి తర్వాత ఒకరుగా నలుగురూ...ఆమె గదిలోకి వెళ్ళి రావటంతో ఆ రైటర్ స్పృహ తప్పిపోయాడు. ఇన్ని జరిగినా ఏ రచయితా (త్రి) బయటకి చెప్పుకోలేకపోయారు. మధుమూర్తి పంపిన ఎడిటర్, రామచంద్రమూర్తిని సీరియల్ రాయమని అడగ్గా "నేను సీరియల్ రాయను బాబోయ్ గౌరవంగా బతుకుతా," అంటూ పరిగెత్తసాగాడు.

(ఇక చదవండి)

మీద పాములు .... కాళ్ళకి చుట్టుకుని కట్లపాములు. శిరసు మీద శ్వేత నాగులు .... మెడలో మిన్నాగులు.... కరకమలాలకు కోడెనాగులు....కసిగా కాటేస్తున్నాయి .... బాబోయ్ .... నేను పాముల సీరియల్స్ రాయను. పాములూ! నేను మీ జోలికిరాను. మీరు నా జోలికి రాకండి. వొద్దు మధుమూర్తీ ...నన్ను బలవంత పెట్టకు. బాధించకు ...ఎర్ర తేలు....మండ్రగబ్బ....రాచతేలు.... సీరియల్స్ నేను రాయలేను.. రాయలేను.... కావాలంటే నువ్వే రాయి...."

ఏమి టీయన ?

రాత్రి పడుకునే వరకూ బాగానే ఉన్నారే !

నిద్రలో ఏమయింది ?

మ్రా ! నా మీదకు రాకు. కాష్మోరా నన్ను పీడించకు. నేను దెయ్యాల నవలలు రాయనని దెయ్యం సాక్షిగా చెబుతున్నాను. నేను మంచివాడిని. భూతాలంటే భయం .... ఆ నవలలు నేను చదవనే చదవను....ఎలా రాస్తాను ? "

"అమ్మా ! నాన్నగారిని నిజంగా దెయ్యమే పట్టుకుంది. ఎగ్జార్సిస్ట్ (Exhorcist -దెయ్యాలను వదిలించేవాడు) దగ్గరికి వెళ్ళవలసిందే." అన్నాడు అప్పుడే లేచివచ్చిన దినకర్.

నేను ఆంజనేయ దండకం మొదలుపెట్టాను. గాలీ ధూళీ సోకితే పోతాయని. ఆయన ముఖం చూస్తుంటే జడుసుకున్నట్లే కనిపిస్తూంది.

"నాగదేవత శాపమేమో .... ఎందుకంటే .... నాన్నగారు పాముల నవలల గురించి తేలిగ్గా మాట్లాడారు. నాగు సీరియలంటే ఒక నాగు ఆటోబయోగ్రఫీయే. రచయిత (త్రి)ని ఆవహించి నాగుపాము రాయించుకున్న ఆత్మకథన్నమాట. దాని కథను అవమానిస్తే నాగుకి కోపం రాదూ? పుట్టలో వేలు పెడితేనే చీమ కుడుతుంది కదా, ఆత్మకథ నవమానిస్తే నాగుపాము అవమానం భరిస్తుందా ? "

ఆంజనేయ దండకం చదివినా ఫలితం లేకపోయింది.

నాకు భయంవేసి - డాక్టర్ని పిలుచుకురమ్మన్నాను. ఆయన వొచ్చి - ఫరవాలేదంటూ ఇంజక్షనిచ్చారు. అప్పటినుంచీ నిద్రే....అదుగో....కదులుతున్నారు...."

"కొంచెం కాఫీ కలపండి....నేనితని సంగతి చూసుకుంటాను." అని పార్వతిని లోపలికి పంపేశాడు దయానిధి.

" రామచంద్రమూర్తి ! "

" ఊఁ.... "

" కళ్ళు తెరుప్...."

"తెరవను....తెరిస్తే.... పాములు, దెయ్యాలు, పిచ్చెక్కిన అమ్మాయిలు మీద పడతారు. సీరియల్స్ చదివి సెమీక్రాక్‌లౌతారు. నవల్లు చదివి పూర్తిగా పిచ్చెక్కుతారు. నేను సీరియల్స్ రాయను. నవల్లు రాయను. నాకు మనుషులమీద ప్రేముంది. గౌరవముంది...."

దయానిధి కేదో అర్థమైనట్లనిపించింది.

దినకర్‌ని పిలిచి ఆటో తెమ్మన్నాడు.

రామచంద్రమూర్తి చేత మెల్లగా కాఫీ తాగించి .... బుజ్జగిస్తూ ఆటో ఎక్కించాడు. ఒకవేపు దినకరూ రెండో వేపు దయానిధీ అతన్ని పట్టుకున్నారు ఆటో పరుగెడుతూంటే.

నిజానికి – దయానిధి రామచంద్రమూర్తికి చాలా చెప్పాలని వచ్చాడు. అతనీ ఉదయమే మెంటల్ హాస్పిటల్‌కి వెళ్ళాడు డాక్టరు బంధువుని కలుసుకుందుకు.

తనూ రామచంద్రమూర్తి వెళ్ళే గేటు నిజంగా గేటు కాదు. అది – తోటలోకి ఎరువులూ అవీ తెచ్చే బళ్ళ కోసమే. వాడు గేట్‌మన్ అసలే కాడు గార్డెనర్.... తోటమాలి అంతే. వాడు తమని మూర్ఖులని చేసి తెలివిగా యిన్ని రోజులూ డబ్బులు వాడికేశాడు.

మెంటల్ హాస్పిటల్ యిన్‌చార్జి అయిన డాక్టర్ భారతి కొత్త విషయం చెప్పింది కొంత బాధ పడుతూ.

ఆంధ్రదేశంలో....సినిమా టిక్కెట్లు పెరగడమూ.... పుస్తకాలు అద్దెకిచ్చే షాపులు వీధి కొకటి వెలవడమూ – దీనితో పాఠకుల సంఖ్య బాగా పెరిగింది. ముఖ్యంగా టెన్త్, ఇంటర్మీడియట్‌లు ఫెయిలయి – పెళ్ళి కోసం ఎదురుచూస్తున్న అమ్మాయిలు – సీరియల్సునీ నవలలనే కాలక్షేపంగా చేసుకుంటున్నారు. అప్పులో ఉన్నవన్నీ అతి నిజాలని నమ్మి ఆ సీరియల్స్‌లోని నాయికతో తమను తాదాత్మ్య పరచుకుని....జీవితాన్నలా ఊహించుకుని వాస్తవం మరోలా....చేదుగా ఉండడంతో షాక్ తిని పిచ్చెక్కి హాస్పిటల్‌లో చేర్చబడుతున్నారు. బాధ్యతా రహితంగా వ్రాయబడుతున్న ఈ సీరియల్స్, నవలలూ– అమాయకపు పాఠకులకు ప్రసాదిస్తున్నవి – ఇల్యూషన్ (illusion) హెల్యూసినేషన్ (Hallucinasion) – మెలోంఖలీ (Melancholy) పెరోనియా (Porraonia) మొదలయిన అవలక్షణాలు. నవలల వల్ల వొచ్చే యీ

వ్యాధులని మొత్తంగా నవలామానియా అని పేరుపెట్టాను. ఒకే రకపు నవలలు అదే పనిగా చదవడం వల్ల వొస్తుందీ వ్యాధి. దీనికి షాక్ ట్రీట్‌మెంట్ అట్టే పనిచేయదు. కొత్త రకం చికిత్సా విధానం కనిపెడుతున్నాను. మొదట- పేషంట్‌ని పత్రికలనుంచీ నవలలనుంచీ దూరం చేయడం. తరువాత జీవితంపట్ల వాస్తవిక జ్ఞానాన్ని కల్పించడం.... దేనికెంత విలువివ్వాలో తెలియజేయడం.... అలాగ...."

"థాంక్స్. మీరు చాలా విషయాలు చెప్పారు."

"ఇంటికి రండి. వారిని కలుసుకుందురుగాని. మీ గురించి అనుకోడమే కాని వారు మాత్రం చూసిందెప్పుడు?"

"అలాగే, సాయంత్రం వొస్తాను.... ఒక మిత్రుణ్ణి తీసుకుని."

"మంచిది. ఇవాళ నాకు సాయంత్రం డ్యూటీ కూడా లేదు."

ఇదంతా చెబుదామనీ....తన రిసెర్చికి ఆమె ద్వారా చాలా మేటర్ దొరికిందనీ - రామచంద్రమూర్తికి చెబుదామని ఎంతో ఆత్రంగా ఎదురుచూసి - విసుగెత్తి అతని ఇంటికి బయలుదేరాడు దయానిధి. తీరా వొస్తే-యిలాగ జరిగింది!

రామచంద్రమూర్తిని - అవతలి గేటులోంచి హాస్పిటల్ లోకి తీసుకువెళ్ళి-ఒక సిస్టర్‌ని రిక్వెస్ట్ చేశాడు. "ప్లీజ్.... ఒక్కసారి టెలిఫోన్ కావాలి. భారతిగారి టెలిఫోన్ నంబరు కూడా!"

ఏ కళనుందో ఆమె అతనికి టెలిఫోన్ చూపించి - "మీరు....ఉదయం ఆమెతో మాట్లాడినట్లున్నారు?" అడిగింది.

"ఔను. ఆమె మాకు బంధువు."

అప్పుడు నర్సే నంబరు రింగ్‌చేసి రిసీవరిచ్చింది దయానిధికి. అతను మాట్లాడిన పదిహేను నిముషాలకు భారతి వొచ్చింది కారులో. దయానిధి ఆమె వెనుకే రూములోకి వెళ్ళి రామచంద్రమూర్తి విషయం - వీలయినంత వివరంగా చెప్పాడు.



"ఫరవాలేదు .... కొద్ది రోజులలో అతను బాగుపడిపోతాడు. హెల్యూసినేషన్‌లా ఉంది. హిప్నొటిజమ్ ద్వారా కారణం తెలుసుకుని .... అవసరమయితే షాక్ యిస్తాను. అవసరమైతే ఆ మధుమూర్తిని ఒకసారి రప్పించవలసి ఉంటుంది." అందామె రామచంద్రమూర్తిని పరీక్షించి....దయానిధి చెప్పింది విని - కేసు వివరాలు రాసుకుంటూ.

"థాంక్స్." చెప్పాడు దయానిధి, "మీ యింటికి తీసుకొస్తానన్నది యితన్నే".

"అయ్యో!" విచారించింది డాక్టరు భారతి.

(సశేషం)

# సూర్యోదయం

భీమవరపు (భృగుబండ) అన్నపూర్ణాశర్మ

శూన్యంలోకి చూస్తున్న ధరణి భుజంపై బలమైన హస్తం పడ్డంతో తల త్రిప్పి చూసింది. కాశ్యప. అతడి పెదవులు చిర్నవ్వు చిందిస్తున్నాయి.

మెల్లగా ఆ చేయి నందుకుని మృదువుగా తన బుగ్గకానించుకుంది. ఆ స్పర్శలో ఏదో ఓదార్పు, ఆలంబన లభించినట్లన్పించింది.

కాశ్యప రెండవ చేయి నందుకుని మరో బుగ్గ కానించుకోబోయేంతలో అతడా చేయిని ఆమె శిరసుపై నుంచాడు.

" ధరా ! " ఆమె చెవి దగ్గర వాత్సల్యంగా, అనురాగంగా పల్కింది, అతడి స్వరం.

ధరణి కళ్ళెత్తి చూడబోయిందిగానీ, కళ్ళు నిండారు లయ్యాయి. అతడా సంగతి గ్రహించాడో, ఏమోగాని నెమ్మదిగా ఆమె శిరసుని తన హృదయానికి హత్తుకున్నాడు.

చల్లని గాలి స్పర్శతో మేఘం ఘనీభవించింది. వర్షం జలజల కురిసింది.

" పిచ్చి ధరణీ ! ఏ ఒక్కరి జీవితమూ వారి స్వంతం కాదు. "

" ఏ ఒక్కరి సంగతి నాకు తెలియదు. నా జీవితం మాత్రం నా స్వంతమే అనుకున్నాను, " అంది ఎక్కిళ్లు ఆపుకుంటూ.

కాశ్యప జాలిగా నవ్వాడు. " నువ్వే కాదు. ప్రతివారూ అనుకుంటారు. అయితే ఆ సంగతి గుర్తించే సమయానికి మలుపు తప్పదని మర్చిపోతారు. "

" అంటే ! " అర్థం కానట్లు అడిగింది, ధరణి.

" పదహారేళ్ళ ప్రాయంలో, ఇరవై ఏళ్ళ యౌవనంలో నిజానికి ఎవరిజీవితం వారికే స్వంతం. పాతికేళ్ళ జీవితంలో మాత్రం జీవితం వారి దెంత మాత్రం కాదు. "

" నా చదువు, సంస్కారం, తెలివితేటలూ అన్నీ వృధా కావల్సిందేనా ? " సూటిగా, చిరాకుగా ప్రశ్నించింది, ధరణి.

కాశ్యప మరోసారి మందహాసం చేశాడు. " నీ ప్రశ్నలో వాడిన పదాల్లో సంస్కారం అనే మాటని ప్రత్యేకంగా గుర్తుంచుకుంటే మిగతా రెండూ వృధా కావు. " అన్నాడు.

" దయచేసి నన్ను సర్ది చెప్పబోకండి. చిన్నప్పటి నుంచీ పెంచుకున్న నా ఆశయం వృధా కాకూడదు " అంది, దృఢంగా.

కాశ్యప వెంటనే మాట్లాడలేదు. కొన్ని క్షణాలు ఆమెనే పరిశీలనగా చూస్తుండిపోయాడు. ధరణి కూడా తన్ను తాను తమాయించుకుని సర్దుక్కూర్చుంది.

" మనలో ఒక మానసిక దుర్బలత వుంది. దుర్బలత అంటున్నానని ఆగ్రహించకేం!" నవ్వాడు, కాశ్యప.

ధరణి కూడా ప్రయత్న పూర్వకంగా నవ్వింది, చిన్నగా.

కాశ్యప వాత్సల్యంగా ఆమె భుజం తట్టి మెల్లగా కదలి వెళ్ళి కిటికీకి వున్న పరదాని మెల్లగా ప్రక్కకి లాగాడు.

బయట రకారకాలైన మనుష్యులు. ఏదో ఆరాటం, తపన. ఒకటి రెండు కార్లు దూసుకుపోయినా నూటికి తొంభై యైదు మందిలో ఒకే విధమైన భావం కన్పిస్తోంది. దేనినో సాధించాలన్న ఆరాటం, అవకాశం లభించలేదన్న ఆవేదన, నిరాశ, నిస్పృహ.

" నాకు తెల్సు. వీరందరి ప్రశ్నకూ జవాబు ఏం చెప్తావని ?" అంది, ధరణి రోషంగా.

" నీకు తెలియని సంగతులతో నిన్ను విసిగించ దల్చ లేదు. కేవలం నీ ఆరాటం మేడలు, మిద్దెలు, విలాస జీవితమే అనుకుంటే నేను నిన్ను వారించను."

ధరణి కళ్ళెత్తి కాశ్యపకేసి చూసింది. రెప్పలు రెపరెప లాడుతున్నాయి.

" ధరణీ! నీ తెలివితేటల్ని, చదువు సంస్కారాల్ని డబ్బుతో కొలవదల్చుకున్నావా ?" మరో ప్రశ్న వేశాడు, కాశ్యప, సాలోచనగా.

అతడి మాటల్లో వాడి కన్పించటంలేదు, ఎదుర్కోవ డానికి. వేడి కన్పించటంలేదు, చల్లార్చడానికి.

" నూటికి తొంభై మంది వినియోగించుకుంటున్నప్పుడు నా ఒక్కదాని కోరికే విపరీతమని నేననుకోవటంలేదు."



## శ్రీవాణి జీవితసభ్యులు



శ్రీమతి వేపా సరస్వతీదేవి
మ చి లీ ప ట్నం

"అనుకోకపోవడం నీ తప్పుకాదు. కానీ సలహా ఇవ్వడం మాత్రం నా ధర్మం అని నేననుకుంటున్నాను."

"ఎందుకట ?"

"నేను దేశం గురించి దాన్ని ఉద్ధరించటం గురించి శ్రద్ధ తీసుకోమనను. మానవుడి కనీస ధర్మంగా చెప్తున్నాను. నువ్వు పెళ్ళి, పేరంటం వద్దని, కేవలం విద్య, సంపాదన మాత్రమే దృష్టిలో పెట్టుకోవటం అంత మంచిది కాదని."

"ఎందుకని, నేను ఆడపిల్లననా ?"

"ఎంతమాత్రం కాదు. నీకు కావలసినది కర్తవ్యమని."

"అంటే నాకర్థం కావటంలేదు."

"నేను తెలియజెప్తాను, నీకర్థంకాకపోతే. అమ్మ, నాన్న నీగురించి ఆలోచించి బాధ్యత వహించే సమయం దాటిపోయింది. స్వయం నిర్ణయశక్తి వచ్చింది. నువ్వు ఎంచుకున్న మార్గంలో నీ పయనం సుగమం కావాలి."

"అందుకే నా నిర్ణయం చెప్పాను, నేను పెళ్ళి చేసుకోనని."

కాశ్యప పొంగివచ్చే నవ్వును ఆపుకు వినసాగాడు.

"అపురూపమైన వైద్యవృత్తి నాది. నా నిర్ణయం, ఆశయం నెరవేరనిస్తే నేను విదేశాల్లోనే కాదు, ప్రపంచ మంతటా ఒక క్రొత్త పంథాని ప్రవేశపెట్టగలను" ఆవేశంగా అంది ధరణి.

"తప్పకుండా ! ముందు నీ ప్రాక్టీస్ ఇక్కడ ప్రారంభించు. ప్రపంచంలో కొన్ని కోట్లు సంపాదించ గలవు గానీ పల్లెలో పోయిన ఒక ప్రాణాన్ని తిరిగి ..."

"అంటే !"

"కనీస సౌకర్యం లేని ఒక ఊరిలో ఒక ప్రాణాన్ని బ్రతికించగలిగితే నీ వైద్యవృత్తికి ఒక అర్థం దేకూరినట్లే నన్నది నా భావన."

"ధరణి నీ చెయ్యి దాటిపోతుందన్న భయం కాదు గదా !" నవ్వబోయింది ధరణి.

క్షణం దెబ్బతిన్నట్లు చూశాడు కాశ్యప. వెంటనే గంభీరంగా "అవును. చిన్ననాటి నుంచీ అనుకున్న సంబంధం. వ్యవసాయం చేసుకుంటున్న కాశ్యపకు ధరణికి కోట్లమంది దొరుకుతారు. కానీ ధరణి ఒక్కతే. కాశ్యపకు దేవత. ఒక సంగతి ధరణీ ! దేవతల్ని పెళ్ళాడగోరిన మానవుల్ని నేనింతవరకూ చూడలేదు."

"మరి చిన్ననాటి నుంచీ అనుకున్న సంబంధం అన్నావు !" ఓరగా చూసింది అతడికేసి.

"అవును. అమ్మా నాన్నలు అనుకుంటున్నారు. ధరణి భయపడ్తోంది, కాశ్యప పేరాశపడ్తున్నాడని. అవునా !"

ధరణి ఇక మాట్లాడలేదు. ఆమె చేతిలో పట్నం హాస్పిటల్ నుంచి వచ్చిన అప్పాయింట్‌మెంట్ ఆర్డరు వుంది. పల్లెనుంచి వచ్చిన కాశ్యప ఎదురుగా వున్నాడు. బస్తీలోని గదిలో కూర్చున్న ధరణి కళ్ళలో విదేశాలలో చెయ్యబోతున్న క్రొత్త ప్రయోగాలు మెదుల్తున్నాయి, కవ్వింపుగా.

అప్పుడే తూర్పున సూర్యుడు ఉదయిస్తున్నాడు. ★

# జ్యోతిష వాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న వాస్తుజ్యోతిష విద్వాన్

కవితా కామేశ్వర శర్మ

అవనిగడ్డ - 521 121

యం. రఘువీర బాబు — సత్తుపల్లి

సమా : కోర్టు వ్యవహారములు యిప్పుడప్పుడే తేలవు. వ్యాజ్యానికి వెయ్యేళ్ళు ఆయుర్దాయమన్నారు గదా ! అనుకూల ప్రతికూలముల విషయంలో - మీకు కొంతదిగా అన్యాయం జరగక తప్పదేమో రఘువీరా ! బాబూ !

సమా : వకాలత్ చేసి ప్రాక్టీసు పెట్టుతారు. ఎంత కాలంకి అని అడగలేదుగా మీరు "నా పృచ్ఛః కశ్చిత బ్రూయాత్" అన్నారు. అంటే అడగని వారికి చెప్ప వద్దనుట. హనుమాన్ చాలీసా పారాయణ చేస్తూం డండి. మనోభీష్ట సిద్ధి అగును.

కె. చంద్రశేఖరరావు — పామర్రు

సమా : మీరు వ్యావహారికంగా ఏ పేరు వాడుతున్నారో ఆ పేరును బట్టి ఫలాలు ఉంటవి. 1986 చాలావరకు మంచి ఫలాలు ఉంటవి. ఆరోగ్యం వగైరా బాగుంటుంది. ఇంటరు 2 nd ప్యాసవుతారు. వ్యావహారికంగా వాడే పేరు అంటే - స్కూలు, వగైరాలలో మీ పేరు "పండు" గాని మీ దస్తూరి మాత్రం .... "

కె. అన్నపూర్ణాదేవి — నందిగామ

సమా : మీ కుమార్తె వివాహం ఆలస్యం. యిప్పుడప్పుడే కాదేమో. ఒకరు ప్రశ్నిస్తే చాలునమ్మా

జానకిరామశర్మగారు — తెనాలి

సమా : మానసిక ఆందోళన అప్పుడప్పుడు మీకు ఉంటుంది. జనరల్‌గా ఉండేదే. 1986 అథవా 87 స్థానచలనం ఉంటుంది. ఉత్తర పశ్చిమ దిశలు.

సమా : పుత్రుల వలన ప్రయోజనం అతి సామాన్యం. మీది యోగ జాతకం అధి యోగం కలదు. జనరల్‌గా సుఖం తక్కువ మీకు. ఎవ్వరికూ అన్ని మంచి లక్షణ ములుండవుగదా ? మంచి Position ఉంటుంది. కళత్ర భావంలో దోషం కనిపిస్తోంది, 8 బు 7 ర యిది స్వల్ప దోషం. మిత్రులు ఉపకారులు కారేమో. కళత్రభావ దోషం పుత్ర భావంలోకి సంక్రమిస్తుంది. 5, 7 భావాలకు పరస్పర సంబంధం ఉంది.

జి. సత్యనారాయణ — తెనాలి

సమా : ఇంటరు ప్యాసవుతారు. విద్య వస్తుంది. బ్యాంక్ జాబు వస్తుంది. భవిష్యత్తు ఫరవాలేదు.

యస్. సత్యసుత — వరంగల్

సమా : మీరు నిజం చెప్పేవారైనా "సత్యమేవ జయతే-నా నృతమ్" అని ఉన్నా ఇది కలియుగంగదా మహాత్మా ! సత్యం అసత్యంచేత జయింపబడునని (పరాశరస్మృతి) పరాశరుడు ఏనాడో చెప్పినాడు-కాలప్రభావం పనిచేస్తుంది గదా ! మీపేరేమిటి ? సత్య...." సార్థకనామధేయులైనా జాతకంలోని గ్రహస్థితి, దానితోబాటు కాలప్రభావం నడుస్తుంది. "సత్యవాక్కారకశ్శుక్రః" శుక్రుడు బాగుండాలి సత్యానికి.

## జ్యోతిష వాణి

పేరు ........................................

పూర్తి చిరునామా ........................................

........................................

........................................

లేఖ వ్రాయు తేది ....................

పైప్పు/పగలు/రాత్రి ....................

జనన తేది ........ తేదిలేనిచో సుమారు వయస్సు